అంతేవాసులతోడ

# హంపీ విహారయాత్ర

**(Hampi Excursion with Pupils)**

రచయిత

ఘుమ్మన్నేని లక్ష్మీనారాయణ

**హిందీపండితుడు**

శ్రీ నాదెళ్ళ సుబ్బరాయచౌదరి బోర్డుహైస్కూలు

పెదపులివర్రు — గుత్తావారిపాలెము



**కోటయార్య వైదిక సాహిత్యమండలి**

అమృతలూరు (P. O.)

(గుంటూరు జిల్లా)



కృతిభర్త:

శ్రీ గింజుపల్లి బాపయ్యగారు

(యమ్. యల్. ఎ.)

# ఉపోద్ఘాతము

ఉన్నతకాయము, సమున్నత ఘోణము, విశాలోన్నత వక్షము వెలయ నుత్తమోన్నతుఁడై, యాజానులంబి బాహువులతో నాకర్ణాయత నేత్రములతో సుగుణసన్నుతుఁడై, మూర్తీభవించిన పురుషకార మనఁదగు దండిమీసముల నిండుదనమునకుఁ దోడుగా జోడు కనులనుండి యోడిగిలు కాంతిపుంజము లార్యజాతిలోని వీరనరపాలుని ముఖవర్చస్సును బుడిసిపుచ్చుకొను తీరును దేటపఱుప సర్వాంగసౌష్ఠవ సంపన్నుఁడై, యంగసౌష్ఠవమున కెనయగు ప్రజ్ఞ, ప్రజ్ఞకుఁ దులయగు శాస్త్రవిజ్ఞత, విజ్ఞతకుఁ బ్రతియగు నిష్పక్షపాత సమీక్షాశాలిత, సమీక్షాశాలితకు నిధియగు ధీకుశలత, కుశలతకుఁ జాలిన ధీరత, ధీరతనుబోలిన సాహసము, సాహసమున నోలలాడు కరుణ, కరుణలో జాల్వాఱు సేవాధర్మము, ధర్మమునఁ బట్టుతప్పని నిరతి, నిరతిని నిలఁబెట్టు ననర్గళమగు నాంధ్రాంగ్లపాండితీగరిమ, గరిమను మెఱయించు సాధువచశ్చమత్కృతియుఁ దనకుఁ బెట్టని నగలై కట్టని కోటలై సర్వదా సర్వథా నెసఁగుచుండఁ

ద్యాగమహిమను మానవ సమాజమునకుఁ జవిఁ జూపుటకు మాత్రమే యవతరించినరీతి మంజుమూర్తియై యొప్పి ప్రత్తిపాటికి గ్రామాధికారియై రంజిల్లు పూజ్యపాదులు శ్రీ గింజుపల్లి బాపయ్యగారి కరకంజయుగళమ్మునం దీ పొత్తంపు టుడుగరను జంద్రున కొక నూలిపోగన్న సామెతగా నామెత చేసి యర్పించు చున్నాఁడను.

—రచయిత

# అర్ఘ్యము

కవి నిస్వార్థజీవి. అతని దృష్టి చాల నిశితము. ప్రకృతి యందలి ప్రతిపదార్థమునందును గవిహృదయము ప్రవేశించును. దానిని సమీక్షించును. దానికి నవజీవన మిచ్చును. తనలో నిద్రాణమైయున్న శివశక్తిని బ్రతిభావ్యుత్పత్తులతో మేళగించి జాగృతమొనర్చుకొనును. వెంటనే లోకమునకు రసానుభూతిని గలిగింప గవియగువాడు రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దజాలమును జేపట్టి కావ్యమును గూర్చును. అది ఛందోబద్ధము కావచ్చు. వచనరచనా నిబద్ధము కావచ్చు. అంతేకాని బలాత్కృతి కసలైన సిసలైన కవి తలయొగ్గడు. దానినిగూర్చి కవిత్వము చెప్పుము, దీనిని గూర్చి కవిత్వము చెప్పుమని యతని నడుగుట యనుచితము. అది యతనికి జేతకానిపని. కవిత్వము కమనీయ హృదయయగు కాంతవంటిది. అందుచేతనే.

"కవితావనితా చైవ స్వయమేవాగతావరా,
బలాదాకృష్టమాణాచేత్ సరసావిరసా భవత్"॥

అని యుద్ఘోషించిన కవీంద్రుని యనుభూతిని నెవరును గాదనలేరు. రసావేశము లేనివాడు కవికాలేడు. అంతేకాదు ; ఆ యావేశమును నిగ్రహించుకొని దానిని సముచితమైన రచనాప్రణాళికలో జాల్వార జేయలేనివాడును గావ్యమును వ్రాయలేడు.

కవి స్వతంత్రుడు. అతనిమీద నాదేశ నిదేశములు పనిచేయవు. అత డుపదేశము లాలకించును. వలయునాడా

యుపదేశములను దన సందేశములలో జోడించుకొనును. తనకు నచ్చిన సందేశములను లోక మాదరించిన సరే; తృణీకరించినను దన గంభీరతకు దొణకు రానీయడు. లోకము నకు హిమనగాగ్ర శృంగమువలె దలయెత్తి నిలిచి తన యుద్దేశమును బ్రకటించును. అందుకే భవభూతి మహాకవి,

"కాలోహ్యయం నిరవధిర్విపులాచపృథ్వీ
సంపత్స్యతే మమచ కోపి సమానధర్మా
యే నామ కించిదిహ నః ప్రథయంత్యవజ్ఞాం
జానంతు తే కిమపి తాన్ప్రతి నైషయత్నః."

అన్నాడు. అతనిమాట యమృతపుటూట. అది స్వార్థరహితము. సంతృప్తి స్ఫోరకము. స్వతంత్రభావ మూలకము. కాదని యెవరనగలరు? "భళిరా! నిక్క ముగ నీవంటివాడె సత్కవి" అని యెవరతనికి నమోవా కము లర్పింపక వెనుదీయుదురు? అట్టి కవిజాతికి జెందిన వారు తెలుగువారిలో గొలదిగ నుందురు. పురాతనులలో పింగళి సూరన్నను, అధునాతనులలో దువ్వూరి రామిరెడ్డిని ఆ జాబితాలో జేర్చికొనక తప్పదు.

మఱి, కవిత్వము గద్యములో నుండవలయునా? పద్యములో నుండవలయునా? యన్న సమస్య యొకటి యెదుటవచ్చి నిలబడుచున్నది.

రససిద్ధులైన కవీశ్వరుల హృదయమునుండి పద్యరూప ముగనే కవిత్వ మాదినుండి యావిర్భవించుచు వచ్చినది. అటు వాల్మీకి వ్యాసాదులుగాని, యిటు నన్నయ తిక్కనా దులుగాని కేవల గద్యమును గవిత్వముగా స్వీకరింపలేదు.

అంతేకాదు; ఇతర భాషలలోఁగూడ మును మొదట గవిత్వము పద్యరూపముగనే వెలువడినది. దీనినిబట్టి చూడ గద్యము కవిత్వముగా స్వీకరించుట కనర్హమైనదా? యని పించును. కాని, తరువాతివారు,

"గద్యం కవీనాం నికషం వదంతి"

అని చెప్పియున్నారు. ఇంతలో నింతమార్పు వచ్చుటకు గారణమేమి? యని యూహింపవలసి యున్నది.

వక్రోక్తి మూలమునగాని, ధ్వని మూలమునగాని, లోకోత్తర చమత్కార జనకమగు వాక్యము మూలమున గాని సహృదయ లోకమును దన్మయపఱచునది కవిత్వమని తొల్లింటి పెద్దలెల్ల రాద్ధాంత సిద్ధాంతములు చేసి యొప్పికొనిరి. "Right word in the right place" అని యాంగ్ల కళాకారులు సిద్ధాంతపఱచుకొనిరి. అట్టి లక్షణము పద్యమున నిముడుట తేలికయై యుండును. అంతియకాక సూచన యొసగి యొక శబ్దమూలమున బెక్కు మనోజ్ఞభావములను బహిర్గత మొనర్చు శబ్దసంవిధానము పద్యమునకే సరిపడి యుండునని నాడు తలచియుందురు. ఏది యెట్లయినను, ముద్రాపణయంత్రశాలలు లేని తొల్లింటి కాలమున నొకరినుండి మఱియొక్కరికి గావ్యసందేశము యథామాత్రకముగా జేరి స్థాయిత్వము గడింపవలసిన సందర్భములో గద్యముకన్న పద్యమే కవితకు ముఖ్య సాధనముగ బూర్వులు కొనియుందురు. ఒక లయ, ఒక యూపు తూగుచుండగా నొక చక్కని నడక ఛందోబద్ధమైన పద్యమును మధురగాన తరంగముపై నడుపుచుండును. ఆ హాయిలే యానాడు

మానవ హృదయమునందు నశింపని ముద్రణ యంత్రశాలలుగా మార్చియుండును. తొలుదొల్త గద్యములో నట్టి సౌకర్యము కన్పించి యుండదు. కవియొక్క భావముతో నిబద్ధమైన పద్యములో మార్పులకుగాని, చేర్పులకుగాని, కూర్పులకుగాని యొక యసామాన్య ప్రతిభాశాలికి దక్క దక్కిన సామాన్యులకు జేయిచేసికొనుట యరుదై యుండును. అదియే పద్యసంప్రదాయమున కొక బిరుదుగా వచ్చియుండును. కాని తరువాతివారు ప్రపంచములోని యన్ని భాషలలోగల కళాకారులును గద్యములోని యీ లోటును దీసివైచి భావవివరణములో బద్యముకన్న గద్యము మిన్నయని యుదాహరణ ప్రాయముగా జాటి చెప్పిరి. పద్యమునకువలె లయ - యూపు - నడక - యెత్తుగడ గద్యములో జూపెట్ట దొరకొనిరి. అలతి పదములతో బహుళభావ విస్ఫూర్తిని వెలయించిరి. అర్థగౌరవముతో గిటకిటలాడు రమణీయ గద్య మూకదంపుతో గూడిన ఛందోబద్ధపద్యమునకన్న మిన్న యని ఋజువుపఱచిరి. అట్టి జిలుగుసేత చెయిదిరిగిన గద్య చక్రవర్తికి గాక పద్యసార్వభౌమున కలవియగునా? అందుకే,

"గద్యం కవీనాం నికషం వదంతి"

అని తరువాతివా రుద్ఘాటించినది. కవిత్రయము వారిలో ప్రబంధ కవులలో గొందఱు తమ రచనలలో గద్య కవితకు మచ్చుతునక లిడకపోలేదు. సంస్కృత వాఙ్మయమున భట్టబాణుడు, వామనభట్టు మొదలగువారు కేవల గద్యకవితయొక్క హొయలును జూపెట్టినారు. తెనుగున

సముఖము వేంకటకృష్ణప్ప నాయకు డొక్కడు మాత్రమే తొలుదొల్త కేవల గద్యకవితకు శ్రీకారము చుట్టినవాడు. అనంతరము శ్రీ పరవస్తు చిన్నయసూరిగారు దానికి రాజవీధులు సంతరించి పెట్టినాడు. అతని నామము సువర్ణాక్షరములతో జెక్కబడినది. ఆ పిదప శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు పలుదృక్పథములు చూపి జవసత్వములతో పాటు తళారింపు లెసగించి గద్య కవిత్వమునకు స్థాయిత్వ మిచ్చినాడు. నాటినుండి తెనుగు వచన రచనకు మంచిరోజులు వచ్చినవి. చరిత్రలు, కథలు, నవల లెన్నో తెలుగువారికి శిరోధార్యములై తెనుగువాణి కురోహార్యములుగా వెలసినవి. అట్టి గద్యకావ్య రచయితల పట్టికలో నగ్రాసన మధ్యా సించువారిలో పండిత శ్రీ క్రొత్త సత్యనారాయణ చౌదరిగా రొకరని లోకమనును. వారిని నేనొరవడిగా గైకొంటకై వారిపేరు నుడువుట లేదు. కవి స్వతంత్రుడుగదా?

స్వతంత్రులైన కవు లొకప్పు డొకే వస్తువును గావ్య వస్తువుగా స్వీకరించుటయు గలదు. అప్పుడు విశేషమేమి? యను ప్రశ్న కలుగును. ఇట్టి సందేహ నివృత్తికే కాబోలు,

> "దృష్టపూర్వా అపిహ్యర్థాః కావ్యేరసపరిగ్రహాత్
> సర్వే ఇవ నవాభాంతి మధుమాస ఇవద్రుమాః"

అని యానందవర్ధనాచార్యుడు చెప్పినాడు. అందుకని హంపీనిగూర్చి వ్రాసిన పూర్వగ్రంథము లెన్నియుండి నను నా గ్రంథమునకు గూడ బాఠకలోకమున దావు లభించునని మనవిచేసికొనుట కవకాశ మబ్బినది. ఆనంద వర్ధనాచార్యులవారి కారిక నుదాహరించుటకు నీవంత

ఘటకుడువా యన్న ప్రశ్న ముద్భవింపవచ్చును. దానికి భవ భూతి వాక్యమును మొదటనే యుదాహరించి యుంటిని. అయినను, గ్రంథములను జదువనోర్పు సమాజమున లేదు. అది సనసన్నగ విలుప్తమైనది.

ఇటీవల ప్రసిద్ధ విజ్ఞానశాస్త్రవేత్త సర్ సి. వి. రామన్ గారు తమ యుపన్యాసమున నిట్లు నుడివిరి. తాను వ్రాసిన విజ్ఞానశాస్త్ర గ్రంథమునకు బాఠకులొక కంపోజిట, రొక ప్రూఫురీడ, రొక రైట రీ ముగ్గురేనట. అంతమాత్ర మున నతడు నిరుత్సాహపడడు. భావలోకము మార్పు చెందును. మంచి రచనకు జావుండదు. కావున గలమున బలమున్నంత దనుక మంచిరచన సాగింపవలయును. అది కవికి సహజగుణము. సహృదయుడగు రచయిత కది ప్రకృతిగుణము. కాని మానవునకు గృతి నంకితమిడుట సహజమా? సముచితమా? యనునది సమాలోచింప దగినది.

సత్త్వరజస్తమోగుణ విలసితము మానవప్రకృతి యగుట యెల్ల రొప్పికొన్న విషయ మగును. తాతముత్తాతల నుండి పలుపోకలతో సమార్జితమగు విత్తరాశికి జిత్త మప్ప గించి ఘూర్కానివలె గాపుదలపూని పిల్లికి బిచ్చమన్న గిట్టని దిట్టలకు బేరుప్రఖ్యాతులు కూర్చిపెట్టు కృతి సమర్ప ణపుజేత రోతయని పల్కుట కళాకారుల ధర్మము. కాని స్వాతంత్ర్యమును బరాస్తమొనరించు స్వార్థమును దూరా పాస్త మొనరించి గళోపాస్తికి మానవ కల్యాణమునకు దన యాస్తిపాస్తు లర్పించు గుణశాలియగు మానవునకు గృతి

నంకిత మిడుటలో దోసగు పోసగదని చెప్పవలయును. అతనిలో సత్త్వజనితములగు సత్య ధర్మ దయాది దైవగుణములు పొంగి లోకోపకారకము లగుచుండును. అట్టివానికి కృతినిడుట యెవరు కాదందురు ? ఎవరాపగలరు ? కావున నా యీ కృతిని సకలసద్గుణరాశియగు నొక మానవోత్తమునకు నంకిత మిడుచున్నాను. మఱి,

"పడినబాటను బయనించువారు కోట్లు
బాటపడుటకు యత్నించువారు కొలఁది"

(రైతు కల్యాణము)

అని విరమించుచున్నాడను.

1-3-55
గుత్తాఘారిపాలెం,
పెదపులివఱ్ఱు.

—రచయిత

# విషయ సూచిక

# మొదటి మజిలీ

## అవతారిక

అటన్ దేశం నరోయాతి
విజ్ఞానం హేతుమూలకమ్,
శ్రుతం శీలం ధనం కీర్తిం
సౌజన్యం గుణ ముత్తమమ్.

'మగవాడు తిరుగక చెడు' నని యనాదిగ వచ్చుచున్న సామెత. దీనిలోని రహస్యమును జాలకాలమునకు గమనించిన విద్యాశాఖవారు బాలురకు బారశాలలో విహార యాత్రల నేర్పాటు చేసిరి. ప్రతి విద్యార్థియు గొంత ఫీజు చెల్లింపవలయును. ఫీజు నిర్బంధము. చెల్లింపక తప్పదు. కాని యాత్ర చేయవలయునను నిర్బంధము మాత్రము లేదు. ఇది కొంత లోటుగనే యున్నది. కావున విద్యార్థులు చెల్లించు ఫీజునకు గొంత ధనమును గలిపి ప్రభుత్వము ప్రతి విద్యార్థిని రెండు మూడు పర్యాయములు విహారయాత్రలు చేయించు టవసరము. ఇట్టి యాత్రలవలన నంతేవాసులు పుస్తక పాండిత్యముతోపాటు ప్రత్యక్షానుభవమును సంపాదింప వలనుపడును. లోక వ్యవహార యాత్రానుభవ మేర్పడును.

లోకజ్ఞాన మలవడును. కూపస్థ మండూకబుద్ధి కుంటుపడి వారిలో విశాలోదార భావములకు దా వేర్పడును. విద్యార్థుల కిట్టి విహారయాత్రలను బెదపులివల్లులోని శ్రీ నాదెళ్ళ సుబ్బారాయ చౌదరి బోర్డుహైస్కూలు లిటీవల గల్పించియుండెను.

పెదపులివల్లు రేపల్లె తాలూకాలోనిది. సంగీత సాహిత్యములకు నిధులై సినిమారంగమున గన్పించు ఘంట సాలకు, సముద్రాలకు మెట్టినయూరు; పుట్టినయూరు. ఇది కృష్ణానదీశాఖాతీరమున నున్నది. మున్నొకపుడు వ్యాఘ్ర పాదుడను మహర్షి యీ నదీతీరమున దప మొనరించి నాడట. అందుచే దీనికి బెదపులివల్లని నామము వచ్చినదట. ప్రజలలో నధిక సంఖ్యాకులు చదువుసంధ్యలు బాగుగ నేర్చినవారు. కవులు, గాయకులు, మార్దంగికులు, వైణి కులు, పండితులు, వక్తలు, కార్తాంతికులును గలరు. ఉన్నతోద్యోగములు చేయుచున్న వారును గలరు. దీనికి బశ్చిమదిశగ పెనుమూడి కొక కాలువ జాలువారును. ఈ కాలువను దాటివచ్చినగాని పెదపులివల్లు ప్రజలు తమ పొలములకు జేరజాలకుండిరి. అందుచే వారిలో గొందఱు కాలువను దాటివచ్చి తమ పొలములలో నిండ్లు కట్టుకొని నివాస మేర్పఱచుకొనిరి. ఆ ప్రజలలో గుత్తావా రధిక సంఖ్యాకులగుటచే దానికి గుత్తావారిపాలెమని పేరువచ్చినది. మహాత్ముని యుపదేశములను బాటించి యమలుపఱచిన శ్రీ గుత్తా చిననరసయ్యగారి కుమారులు చలమయ్య సోదరుల దీ గ్రామమే.

శ్రీ చలమయ్యగారి సోదరుల కుటుంబము వర్ణభేదమును పాటింపక విశాల మానవ సమాజముతో బంధుత్వము నెఱపినది. ధనికులగు శ్రీ నాదెళ్ళ సుబ్బారాయ చౌదరిగారీ గ్రామమున ప్రముఖ కుటుంబమునకు జెందినవారు. వీరు కర్మవీరులు, నిరాడంబర జీవులు, మహా త్యాగులు, విద్యా ప్రియులు. వీరి కీర్తికి మూర్తిద్వయమువలె వీరి కిరువురు పుత్రులు గలరు. పెద్దవాడు శ్రీ వేంకట్రామయ్య చౌదరి గారు. వీరు సంస్కృతాంధ్రములలో బండితులు. రెండవ వాడు కృష్ణారావుగారు. ఇతడు పాశ్చాత్య విద్య నభ్యసించి "యం. బి. బి. యస్." డిగ్రీని బొందియుండెను.

శ్రీ వేంకట్రామయ్య చౌదరిగారు తండ్రి దివంగతు డైన పిమ్మట దమ తండ్రిగారిపేర గుత్తావారిపాలెమున నొక హైస్కూలును స్థాపించిరి. కృష్ణారావుగా రన్నగారి సత్కార్యమునకు దోడుపడి హైస్కూలు నిర్మాణమును సమగ్ర మొనర్చి దాని నభివృద్ధికి దెచ్చిరి. అందుచే నా హైస్కూలునకు "నాదెళ్ళ సుబ్బారాయ చౌదరి బోర్డు హైస్కూ"లని పేరు వచ్చినది. ఈ హైస్కూలు నుండియే యంతేవాసులతోడి మా హంపీ విహారయాత్ర ప్రారంభింప బడినది.

# రెండవ మజిలీ

## యాత్రాసన్నాహము

అది యిరువది యారవ తేది. అమావాస్య. ఆదివారము. మంటికి మింటి కేకధారగ వర్షము. ఎటుచూచినను పంకసంకుల మార్గములు. ఆదివార మమావాస్యనాడు పడమరకు బయనము మంచిదికాదని వృద్ధుల యాటంకము. హేతువులేని సనాతన మూఢాచారములే వర్జ్యములని విద్యార్థులు. మైసూరుయాత్ర, హంపీ విజయనగర సందర్శనౌత్సుక్యము, చెన్నపురి దిదృక్ష ముప్పిరిగొని విద్యార్థుల హృదయములను ముదముచే మదింపజేసినవి. ఏవంక బరికించినను విద్యార్థుల ప్రయాణోత్సాహ నినాదములే. సామానులన్నియు యముని కాసరము సీసడింపజాలు మహిషముల బూన్చిన శకటముల కెత్తింపబడి హైస్కూలు వ్యవసాయ శాఖాధ్యాపకులు శ్రీ ఘంటా రఘురామయ్యగారి యాధ్వర్యమున భట్టిప్రోలు రైలుస్టేషనునకు జేర్పబడినవి.

ఒకానొక కాలమున భట్టియను నామముగల యమాత్యుని సహాయమున విక్రమార్కుడు పాలించుటచే దానికి భట్టిప్రోలను నామము వచ్చినదని వృద్ధ పరంపరా శ్రుతేతిహాసమువలన దెలియుచున్నది. ఇది తెలుగునాటి చరిత్రలో బ్రసిద్ధిగన్న పట్టణము. బౌద్ధులకాలమున నిది యెంతయు నుచ్ఛస్థితిలో నుండెననుట కెన్నియో చారిత్రకాధారములు గలవు. నేటికి నిందొక బౌద్ధస్థూపకము గలదు.

బుద్ధభగవానుని దంతము నొకదానిని సింహాళీయులు కొని పోవు తఱి నాంధ్ర నరపతులు వారి నెదిర్చి జయించి దానిని గొనివచ్చి సగభాగము భట్టిప్రోలు బౌద్ధస్తూపము నందును మిగిలిన సగము ఘంటసాల స్థూపము నందును నుంచినట్లు జనశ్రుతి యొకడు గలదు. ఈ స్థూపమునందు బుద్ధుని దంతమును బెట్టిన చలువరాతి పాత్రలు శిల్పుల చాతుర్యమునకు గీటుఱాలై యందములను వెలిగ్రక్కుచు మద్రాసునందలి మ్యూజియమునందు బెట్టబడి యున్నవి. ఈ పాత్రల నుంచిన ఱాతి చిప్పలు నాటి తెలుగువారి బుద్ధి చాకచక్యమును వేనోళ్ళ బొగడుచున్నవి. ప్రస్తుత మిందు కుబేరుని బీరమును నీరసముగ జూడజాలిన బేహారు లధికముగ గలరు. వీరితో పాటు ఢక్కా మజిలీలను మించిన వస్త్రముల నేయజాలిన పద్మసాలెవారును గలరు. భారత స్వాతంత్ర్య సముపార్జన మునకై మహాత్ముడు సాగించిన సత్యాగ్రహ సమరమున వైశ్యప్రముఖు లధికముగ బాల్గొని యీ పత్తన రాజమునకు గల పూర్వౌన్నత్యమును మెఱుగు వెట్టిరి. ఇట్టి పట్టణమును మొదటిజట్టు చేరుకొన్నది.

ఇక మా రెండవజట్టు గుత్తావారి పాలెమునుండి వెడలి శ్రీ కొసరాజు కృష్ణారావుగారి యాజమాన్యమున బ్రకృతి సౌందర్యమునందు గోనసీమను మించు పల్లెకోనకు జేరినది.

మా మూడవజట్టు మాత్రము స్వీయసేనానిని గోలు పోయిన సేనానీకమువోలె నేతృత్వ విహీనమై చెల్లాచెదరై జానుదఘ్నమగు పంకమున గొంకక నడుగులిడుచు నడ్డమైన

జలప్రవాహముల నధిగమించుచు నెల్లెటో మొదటిజట్టు చేరిన భట్టిప్రోలు రైలుస్టేషనును జేరెను. కాని మా పడిన శ్రమను లెక్కగొనకయే ధూమశకటము మా రెండు జట్టుల కందక వెళ్ళిపోయినది. శ్రమను గుఱుతించి దానికి దగిన ఫలమునిచ్చు కాలము కాదుగదా! యని విషాదమును వెలిబుచ్చి మిన్నకుంటిమి. రైలుదిగి మాకై వేచియున్న పల్లెకోన జట్టు మాలో జేరినది.

ఎల్లర మొకచో జేరితిమి. మిన్ను చిల్లివడినది. మన్ను మఱల జలమయమైనది. వాతావరణము మమ్మెంత చీకాకుపఱుచుచున్నను దానిని లెక్కగొనలేదు. మే ముత్సాహమును వీడలేదు. మఱియొక రైలు వచ్చుటకు జాలతడవు గలదు. మా జట్టులోని బాలురు కొందఱు సామానులను గాచికొనియుండ మఱికొందఱు తమ కిష్టమైన తావుల జూచుటకు భట్టిప్రోలిలోనికి వెడలిరి. అట గల శిథిల బౌద్ధస్థూపమును గాంచి కొంతతడవునకు వచ్చి యా బాలురు నన్ను జుట్టుముట్టిరి. అందు మా నరేంద్రుడు, "నాన్న! యీ గ్రామమునగల భౌద్ధస్థూపమును జూచి వచ్చితిమి. అచ్చటివారు మమ్ముజూచి 'లంజెదిబ్బను జూడ వచ్చితిరా?' యని ప్రశ్నించిరి. బౌద్ధస్థూపమును 'లంజదిబ్బ' యనుటకు గారణమేమి?" యని నన్నడిగెను.

ఔను; ఆంధ్రావనిగల బౌద్ధస్థూపములు లంజెదిబ్బ లని పేరువడ్డవి. క్రీస్తునకు బూర్వమున దరిదాపు 567 వ సంవత్సర ప్రాంతమున గౌతమబుద్ధుడు జన్మించి నాటి హింసా పూరితములగు యజ్ఞయాగాదులకు వ్యతిరేకముగ ధ్వజమెత్తి

యహింసాప్రధానమగు బౌద్ధమతమును స్థాపించినాడు. బుద్ధుని తరువాత వేదవిరుద్ధమగు నీ మత మవిచ్ఛిన్నముగ ఖండ ఖండాంతరముల నఖండఖ్యాతి నార్జించి వ్యాపించినది. బౌద్ధసన్యాసులు, బౌద్ధసన్యాసినులు మిక్కుటముగ ప్రచారము చేయుచుండెడివారు. పిదప కొంతకాలమునకు క్రమముగ బౌద్ధము క్షీణింపసాగినది. దానిని పోషించువారు కఱవైరి. బౌద్ధసన్యాసుల నాదరించువారుగాని బౌద్ధ సన్యాసినుల బోషించువారుకాని లేకపోయిరి. అంతట బౌద్ధసన్యాసినులు తమ యాజీవికకై తాము నివసించుచుండు బౌద్ధస్థూపములకడ పడుపువృత్తిని సాగించుచుంట కతమునో బౌద్ధస్థూపములు చైత్యములును పాడువడి జన నివాస విరహితములై నగరమునగల జారజారిణులకు సంకేత స్థానములగుటచేతనో వానికి లంజదిబ్బలని పేరు వచ్చియుండ వచ్చునని చెప్పితిని. లేక, సనాతనధర్మపరాయణులు తమ మతమునకు వ్యతిరేకముగ బౌద్ధమును సంస్థాపించుటచే గినిసి వారు బౌద్ధము క్షీణించుకొలది తమ కసిదీర వాని కట్టిపేరు పెట్టి లోకమున ప్రచార మొనరించియైన నుండవచ్చుననియు జెప్పితిని. ఈ నా వాదమునకు జరిత్రాధారములు గలవని నుడివితిని.

సాయంసంధ్య సమీపించినది. చదువరి బుడుతల యుదరముల నెలుకలు ప్రవేశించినవి. ఇది గమనించిన మా జట్టులోని డ్రిల్లుమాష్టరు శ్రీ ఉప్పల సుబ్బారావుగారు సమీపమునగల యొక గేస్తుని గృహముకడకేగి వారి యనుమతి వడసి విద్యార్థుల నటకు జేర్చి మా వెంట గొంపోయిన శాల్యోదనమును ఘృతసూపలేహ్య సమేత

ముగ వడ్డించి యంశమున మాహిషదధితో బుభుక్షనుదీర్చి సంతృప్తులగావించి యా మాత్రము చోటొసగిన గృహస్థునకు ధన్యవాదము లర్పించి వారిని మఱల ధూమశకటనిలయమునకు మాతో జేర్చెను.

ఇంతలో లోకబాంధవు డస్తాద్రిదరి జేరినాడు. ధూమశకటము భట్టిప్రోలుస్టేషను సమీపించినది. మఱల మా జట్టులో నుత్సాహము పెచ్చుపెరిగినది. విద్యార్థులలో జయ జయ నినదములు చెలరేగినవి. సామానులను జంకలలో మూపులపై శిరములమీద నిడుకొని విద్యార్థి కిశోరములు సింహకిశోరములు పర్వతగుహల డాగినట్లు శకటమెక్కి దాని గర్భమున డాగిరి. బండి కదలినది. కాఱుమబ్బులను గాదనజాలిన ధూమ్రనివహమును నింజనుపైకి విడుచుచుండెను. దానిని గాంచి మా జట్టులోని పెద్దలును, చిన్నలును బుగాకనెడి విరాట్స్వరూపుని యవతారములైన బీడి, సిగరెట్టుల నెలిగించిరి. నిమిషములో జిలుమబ్బులు సృష్టించిరి. వాని మూలమున ధూమ్రపాన మెన్నడెఱుగని మావంటివారి ప్రాణము లుబ్బుకుడిచినవి. బండి తెనాలి చేరినది. అట గంట విశ్రమించి మఱల నది గర్తపురమునకు బయలుదేరినది. కాఱుచీకట్లు క్రమ్మిన కతమున వెలుపల నేమియు గానవచ్చుటలేదు. విసువుజెందిన విద్యార్థులు కొందఱు హాయిగ నిద్రబోయిరి. మార్గమధ్యమున మాకు వీడ్కోలొసగు తలపుతో మా ప్రధానాధ్యాపకులు శ్రీ గవిని సీతారామయ్య, బి. ఏ., బి. ఇడి. గారు స్వగ్రామమగు నేజండ్ల స్టేషనులో బండినెక్కి మమ్మును హెచ్చరించుచు గుంటూరుదనుక వచ్చి దిగిరి.

# మూడవ మజిలీ

## గర్తపురి మండలము

బండి గర్తపురిలో నాగినది. రైలుస్టేషను స్థానికాధికారులతో గిటకిట లాడుచుండెను. స్థానిక శాఖా మంత్రులు శ్రీ తిమ్మారెడ్డిగారును, రెవిన్యూశాఖా మాత్యులు శ్రీకోటిరెడ్డిగారును, గుంటూరు వత్తురని వార్త దెలిసినది. వారికై వేచియున్న యధికారివర్గముతో స్టేషను క్రిక్కిరిసి యుండెను. అందుచే మా జట్టులోని వారికి బరుండుటకు సరియైన తావు దొరకలేదు. వారటు నిటు పచారుచేయ దొడగిరి. కలవులో నధికమాసమన్న సామెతగా బండ్లును గంట యాలస్యముగ వచ్చునని స్టేషనుమాష్టరుగారు ప్రకటించిరి. ఆకసము చిల్లివడినట్లు జడివాన సాగినది. దానికి దెంపులేదు. స్టేషనంతయు జలమయమైనది. రైలుదారి నీటిలో మునిగిపోయినది. ఇట్టియెడ విజయవాడనుండి రైలుబండి వచ్చినది. దూరమున జూచి దానిని విద్యార్థులు శుక్రాచార్యుడని నవ్వుకొనిరి. దగ్గఱించి చూచినపిదప నేకాక్షుడగు శుక్రుడు కాదు; తనువెల్ల విద్యుద్దీపముల వెలుగొందు సహస్రాక్షుడని కొనియాడిరి. వాన యాగలేదు. సుఖాసీనులై యున్న యధికారు లెల్లరు మిక్కిలి యాతురముతో లేచి వర్షాధిక్యమును కూడ లెక్కసేయక బండిని నమాత్యులకొఱకు గాలించిరి. కాని వారందు బొడకట్టలేదు. అధికారులు మాత్ర మన్వేషణమును వీడలేదు. అంత

"మంత్రులు రాలేదు. ఇంకను నేలూరులో నుపన్యసించు చునే యున్నారు. తెల్లవాఱుజామున మూడుగంటలకు వత్తు"రని యాకాశవాణి వినిపించినది. అదివిని నిర్వాహకులగంది యధికారు లెల్లరు తమ యద్దె గృహములకు మఱలిరి. త్రుటిలో స్టేషను నిర్మక్షికమైనది. మా విద్యార్థులకు వలసి నంతచోటు చిక్కినది. సామానులను గాచుకొని విద్యార్థులు కొందఱు నిద్రించిరి. మఱికొంద ఱంతకుమున్న సమీపమున గల సినిమాలకు బోయిరి.

మా జట్టులోని టికెట్టు వన్ ఫోర్తులలో మా నరేంద్రు డొకడు. అతని కానాటిరేయి నిదురపట్టలేదు. మెల్లగ నాదరిజేరి "గుంటూరు విశేషములు చెప్పునాన్న!" యని యర్థించినాడు. జిజ్ఞాస కలవాడె విద్యార్థి యనుకొంటి. అతని ప్రశ్నమునకు సంతసము కలిగినది. ఇట్లు వివరించితిని. "వినుము, నెల్లూరు రాజధానిగ తెలుగు నేల నేలిన మనుమ సిద్ధి నరపాలునకు మంత్రియగు తిక్కనసోమయాజియు, సేనాపతియగు ఖడ్గతిక్కనయు నీ గుంటూరు పురమునందే జన్మించిరి. తిక్కనకు గవిబ్రహ్మ యను బిరుదము గలదు. పదునైదు పర్వములు భారతము నాంధ్రీకరించెను. తిక్కన తండ్రియగు కొమ్మనామాత్యుడు గుంటూరునకు దండనాథు డుగ నుండెను. తిక్కన తాతయగు భాస్కరమంత్రి గుంటూరునకు ఉదయరాజు తరఫున బరిపాలకుడుగ వెలసియుండెను. ఈ గుంటూరున బ్రసిద్ధికెక్కియున్న ఎఱ్ఱచెఱువులో నల్లచెఱువులో ఖడ్గతిక్కన కవితిక్కన లీదులాడి యుండవచ్చును.

నేటికిని గుంటూరుసీమ కవులకు బుట్టినిల్లు. భాషాభిమానులకు బురిటిగీము. రాజనీతి చతురులకు దరుగని గని.

ఊరూర నౌక బోర్డు హైస్కూలును నెలకొల్పి భారతావనికి మకుటమణినిగా గుంటూరు మండలమును దీర్చి దిద్దిన శ్రీ పాములపాటి కృష్ణయ్యగారుండున దిచ్చోటనే. గాంధిమహాత్ముడు సాగించిన దండి యుప్పు సత్యాగ్రహ సమర సమయమున బ్రిటిషు పార్లమెంటువఱకును బోయిన గాంధిటోపీ కే సీగుంటూరు నగరమునుండియే. అవిభక్త మద్రాసు రాష్ట్రమునకు ప్రధానమంత్రి పదవి నిర్వహించిన శ్రీ బొల్లిని మునిస్వామి నాయడుగారి పేర గట్టించిన జిల్లా బోర్డు దివ్యభవన మీ గుంటూరునందే గలదు. ఆంధ్ర కవిలోకమున ప్రతిభాశాలియై విలసిల్లి మేలిజిలుగు కవిత్వముల్వ్రాయు శ్రీ జాషువా కవిపుంగవునకు గనకాభిషేకము చేసినదీ గుంటూరు పురమే. ఇక్కడ హిందూకళాశాల, క్రైస్తవ కళాశాలలు గలవు. మెడికలు కాలేజి, గరల్సు కాలేజి, కుర్గ్లరు హాస్పటలు, జనరలు హాస్పటలు, జూట్ మిల్లు పెక్కు రైసుమిల్లులు నిందు గలవు. మహిళా విద్యోన్నతి నాకాంక్షించి శ్రీ ఉన్నవవారికి జేయూతనిచ్చి గ్రామసీమలగల కృషీవలులు చందాలతో బోషించిన శారదానికేతన మిందు గలదు. ప్రస్తుత మిందు దాత్కాలికమగు నాంధ్ర హైకోర్టు గలదు. కాంగ్రెసులో వన్నె వాసియు గాంచిన శ్రీ కొండా వేంకటప్పయ్యగారి కిది జన్మస్థానము.

కమ్యూనిజ వాదమునకు, కాంగ్రెసు ప్రచారమునకు, సోషలిస్టు తత్త్వమునకు, ప్రజా సోషలిస్టుల యవతారికకు,

కృషీకారలోకపార్టీ బలపడుటకు నీగుంటూరు మూలకం దము. బకింగుహాము కాలువగట్టున నిటీవల పెద్ద తటాకము త్రవ్వబడి యందలి జలము కాల్వల మూలమున నిటకు గొనిరాబడుచున్నది. ప్రస్తుత మిందు నీటియెద్దడి లేదు. చౌదరిపేట, చంద్రమౌళి నగరు, పట్టాభిపురము చూడ ముచ్చట గొలుపును. ఆంధ్రావనికి రాజధాని కాదగిన సమస్త లక్షణములు గుంటూరునకే గలవని వాంఛూ న్యాయాధిపతి నిర్ణయించిన నిర్ణయ మసలైనది; సిసలైనది.'' అని చెప్పుసరికి, 'రాజధానిని కర్నూలుగ నెందుకు నిర్ణయించిరి నాన్న!' అనుచు నరేంద్రుడు నిద్రపోయినాడు. పాప మతడు పసివాడు. పసివారలకు నిద్ర మెండుగదా!

అప్పటికి దాదాపు రెండున్నర గంట లైనది. కొంత వడికి బ్రాహ్మీ ముహూర్తము సమీపించినది. కాని వర్ష మాగ లేదు. మంత్రుల గొనిపోవుటకు మఱల నధికారు లరుదెంచిరి. త్రుటిలో రైలుస్టేష నధికారులతో గ్రిక్కిరిసి పోయినది. విజయవాడనుండి రైలు మంత్రిని గొనివచ్చి విజయగర్వముతో కూత వేసినది. అధికారు లమాంతముగ బండిని ముట్టడించిరి. మంత్రిశేఖరులు చిఱునవ్వు గదుర బండినుండి వారికి దర్శన మిచ్చిరి. అధికారుల వెంట బండిదిగి మంత్రిగారు పురమందిరమునకు బూలమాలలతో సాగిపోయిరి. మా జట్టు విద్యార్థులు ప్రయాణసన్నద్ధులైరి. ఆంధ్రావనికే గాక భారతావనికే యమాత్యులము కాగల యుజ్జ్వల భవిష్యత్తు మాకును గలదను నాత్మవిశ్వాసముతో విద్యార్థ

ఱెల్ల నమాత్యులచే రిక్తము గావింపబడిన శకటము నలంక రించిరి. బండి కదలినది.

వర్షాతిరేకమున బండి మురికిగూడెమువలె దయా రైనది. కూరుచుండుటకు రవ్వంత యేనియు బొడిచోటు మాకు బొడకట్టలేదు. నాటి రేయి వేగువఱకును నిలువు జీతవు గొలువుంటిమి. కష్టమును గణింపమైతిమి. సోకోర్చు వారెగదా మానవులు !

మబ్బులు వీడలేదు. వానాగలేదు. కమలినీకుల వల్ల భుని దర్శనమే లేదు. బండి శరవేగమున బరుగిడుచున్నది. అంతలో నరసరావుపేట మమ్ము డాసినది. అది యాంధ్ర అసెంబ్లీకి స్పీకరైన శ్రీ నల్లపాటి వేంకట్రామయ్యగారి ప్రాక్టీసునకు మెఱుగు పెట్టిన తావని విద్యార్థులకు వివరించి తిమి. అటసాగి రైలు సంతమాగులూరు సమీపించుసరికి లోగడ నటజరిగిన రైలు ప్రమాదము గుప్పున గుప్తికి వచ్చి నది. అశేషజనానీకమును దనపొట్ట బెట్టుకొన్న సంతమాగు లూరు చెఱువు వాగును మాచదువరి బుడుతలకు బరిచయ మొనర్చితిమి. ఇరువాగుల వాగులు రొదజేయుచున్నవి. వాన జోరున గురియుచున్నది. ఈదరకు బాలురు ముడుచు కొని పోయిరి. బండి వినుకొండ జేరినది.

గుంటూరుజిల్లాలో బడమర హద్దునగల చివరి హైస్కూలు వినుకొండలో గలదు. సీతాన్వేషణమునకై బయలుదేరిన శ్రీరామచంద్రుడు జటాయు మూలమున సీతను రావణు డపహరించి లంకకు గొనిపోయిన వార్త నిక్కడ వినుటచే నీ గ్రామమునకు విన్నకొండ లేక విను

కొండ యని పేరు కలిగినదని చెప్పబడు పుక్కిటి పురాణ మును మా విద్యార్థుల కెఱింగించితిమి. వినుకొండ దాటి కొంతదూర మేగిన వెంటనే నెల్లూరు, కర్నూలు, గుంటూరు మండలముల కూడలి సరిహద్దు కన్పట్టునను విషయము పిల్లలకు దెలుపబడినది. పిమ్మట రైలు దొనకొండ స్టేషనులో మకాము చేసినది.

దొనకొండలో దిగి మా విద్యార్థులలో జిరంజీవులు నాగేశ్వరరావు, మన్నె జగన్మోహనరావు, శివరామ కృష్ణయ్య, కోటేశ్వరరావు మంచినీరు పట్టి తెచ్చి బండిలో బెట్టిరి. భుక్తికి వేళ యతిక్రమించినది. మా జట్టులోని వారెల్ల రాకలికి దాళలేక నకనక లాడుచుండిరి. మా వెంట గొనిపోయిన పులిహారను మునుముందు విద్యార్థులకు బెట్టి మేము భుజించితిమి. క్షుత్తులారినవి. ముదము చేకూరినది. రెప్పపాటులో మార్కాపురమున వాలితిమి.

## నాలుగవ మజిలీ

## కర్నూలు మండలము

మార్కాపురము రోడ్డునుండి చూడ జూపుమేరలో నేవంకను నూరు కన్పింపలేదు. దూరమున నొకతటాకము విశాల సాగరమువోలె గన్పట్టినది. అది మార్కాపురము చెఱువు. మార్కాపురము వ్రాతపలకలకు, బలపములకును

మిగుల ప్రసిద్ధి. ఇక్కడ బలకల యుత్పత్తి హెచ్చు. ఇటనుండి భారత దేశములోని యితర పట్టణముల కవి యెగుమతి చేయబడును. ఈ విషయము విద్యార్థులకు దెలిపితిమి. అంతలో రైలు కంబము చేరినది.

కంబము ప్లాటుఫారము మీద బోర్డుపై "CUMBUM" అని వ్రాయబడి యున్నది. మా జట్టులోని వారెల్లరు నాంగ్ల విద్యావాసన గలవారు కావున బైవ్రాతను "కుంబ"మని చదువదొడగిరి. అది మాకు గొంత వినోదమును గలిగించి నది. దానిప్రక్కనే తెలుగులో "కంబ" మని వ్రాసియుంట గాంచి నరేంద్రుడు కుంబము కాదిది కంబమని నుడువ విద్యార్థులలో నొకడగు రణకిశోర బాబు "ఆంధ్రమున కాంగ్ల మా దేశమైనపు డొకానొకచో కంబము కుంబ మగు"నని సూత్రించుసరికి మే మెల్లరము కడుపు చెక్కలగు నట్లు నవ్వుకొంటిమి. స్టేషనునుండి కనుపించుచున్న హైస్కూలు భవనమును విద్యార్థులకు జూపితిమి. కంబ మును జుట్టియున్న కలమవిలసిత భూభాగములు గనుల విం దొనరించినవి. పేరు వడసిన కంబము చెఱువును వీక్షింప నుత్సూత లూగితిమి. ఇంతలో నెదురుగ నెత్తైన కొండ సమీపించినది.

ఆ కొండయొక్క యెత్తైన పాదుమీదుగా నొరసికొని సుమారము మెలికలు మెలికలు తిరుగుచు నెమ్మది నెమ్మదిగ రైలు నడచుచుండ మాకు సంభ్రమాశ్చర్యములు కలిగినవి. ఆ కొండ కవ్వలివైపున విశాలము గంభీరము నగు సాగరము వంటి కంబము చెఱువు తగిలినది. అటనున్న కొండ

లోకచోట జాలతక్కువ యెత్తు. ఆ చాల తక్కువ యెత్తు మీదుగా మలకలు మలకలుగా సుడులు దిరిగిన రాతిత్రోవ చెఱువుమీదికి నడచినది. రాతిబాట కలిసిన చెఱువు యొక్క రాతిగట్టు క్రిందుగ పెద్దతూములు నిర్మింపబడినవి. 'కంబము చెఱువుగట్టు చూచి దున్నపో తఱచిచచ్చె'నని సామెత గలదు. అట్టి రాతిగట్టుపై డి. పి. డబ్ల్యు. వారి యాఫీసులు గలవు. చెఱువునందును గొండలు గలవు. నిజముగ నాగట్టు పెద్దయెత్తున నున్నది. దానినుండియే బ్రహ్మకుండి (గుండ్లకమ్మవాగు) నదిపుట్టి ప్రవహించుట. అట్టి చెఱువును కనుల కఱవుదీర చూడనీయక రైలు దాటిపోయినది. కాలము చుప్పనాతిది. కాలప్రవాహమున బడిపోక దాని కెదురీది నిలువగల మహాత్ము లెందరుందురో? శకటమును నిందించిన లాభమేమి?

త్రోవలో నన్నియు గొండలే. కొండల నానుకొని పిక్కచిట్టడవు లున్నవి. అడవులలో బసులకాపరులు పసులను మేపుచు గొండ నెత్తములపై గుమిగూడి యుండిరి. మొలకు జేనెడుగుడ్డ పీలికయైనను లేక వానతుంపురులలో నానుచు నీదరగాలికి వణకుచు ఱొమ్ములపై చేతులు గప్పుకొనియున్న యా పసులకాపరుల దుటముల గాంచినపుడు హృదయవీధిని భావతరంగములు పరిపరి విధముల బరుగిడినవి. మానవ సమాజమునకు దూరముగ నిల్చి లోక కర్తవ్యములను విడిచిపుచ్చి యడవులలోని కొండ గుహలలో ముక్కుమూసికొని కూర్చుండెడి మహాత్ములకన్న లోకహిత కర్మ ప్రవణులై శీతవాతవర్షాతపముల వాతబడుచు కర్తవ్య

కర్మ నిర్వహణమున లగ్నులైయున్న యా పసుల కాపరులే మిన్నలని తోచినది. మానవుని విలువ మనుజులకే తెలియును. పర్వతములకు నిర్జనారణ్యముల కేమి తెలియును? కడుపునిండుగ మేసి పర్వతోపరిభాగములపై నైక్యమును గోల్పోవక యాత్మరక్షణకై యొకచో జేరి గుంపుగ నిల్చియున్న యా పసుల తండములను గాంచినపుడు సర్వజ్ఞులమని సర్వ సమర్థులమని భ్రమ్మ బాదుకొని స్వార్థమునకై చీటికి మాటికి గయ్యములను బెంచుకొనుచున్న మన ప్రపంచ రాజకీయవేత్తలు వానిముందు బలాదూ రనిపించినది. నేటికి నా దృశ్యములు కనుల కదృశ్యములై హృదయ నేత్రమున దృశ్యములై నిల్చియున్నవి.

మా యంతేవాసుల విహారయాత్ర గాంచి ప్రకృతిమాత యానందబాష్పములు రాల్చుచున్నదో యన నింకను వానజల్లు లల్లనల్లన పడుచునే యున్నవి. మార్గమంతయు మిట్టపల్లములుగ నుండెను. రైలుమార్గమున కిరువైపుల బహుదూరమువఱకు సుదీర్ఘముగ నున్న పర్వతశ్రేణి రైలుతో బందెమిడి పరుగిడుచునే యుండెను. ఎపుడు జూచినను రైలునకు ముందే యాకసము నంటిన యా కొండల బారు కాన్పించుచునే యుండెను. తెలుగు సీమలో బ్రసిద్ధి గాంచిన నల్లమల సాంద్రారణ్యము దిగువమెట్టనుండి ప్రారంభమైనది.

రైలు దిగువమెట్ట స్టేషనువీడి నల్లమల దండకారణ్యమున బ్రవేశించినది. అందలి ఘాతుక మృగముల దలంచుకొని యొడలు గగుర్పొడిచినది. కాని రైలుగర్భమున

సురక్షితముగ నుంటిమని స్పృహాతగిలి పొంగిపోతిమి. అచ్చటి స్టేషను సిబ్బంది కనుచీకటి వ్రాలగనే యాఫీసు లలో నుండియే తమపనుల నిర్వహించుకొందురట.

ఆ యడవిలో గొంత దూరమేగ నొకచో పెద్ద యెత్తైన కనుమ యడ్డు నిలిచినది. కనుమపై గనులపండువు గూర్చు పచ్చని బలిష్ఠములగు మహోన్నత వృక్షజాల లతా తృణకుంజ గుల్మాది పుంజములు కన్పించినవి. ఇరుప్రక్కల జుట్టును జీబుకొని యరణ్యపంక్తి భీకరముగ నున్నది. రైలు మెలమెల్లన నేటవాలుగ మెట్టనెక్కుచు నడ్డుకొన్న యా పెద్ద కనుమను జూచి కూతవైచి డీకొని దాని గర్భ మును బొడిచి యావలికేగుచున్నదో యనునట్టులా కొండను తొలిచి మలిచిన సొరంగములోని రైలుమార్గము వెంట విద్యుద్దీప సహస్రనేత్రములు విప్పుకొని విజయగర్వమున ఠీవిగ దరిదాపు మైలుదూరము నడచినది. అపుడు మా విద్యార్థుల సంతోషాతిరేకమునకు విజయధ్వానములకు మితికట్టలేము. దండకారణ్యమును ఛేదించి పర్వత గర్భమును జీల్చి నిర్మించిన యా రైలుమార్గమును జూచిన మా యంతేవాసులు సంభ్రమాశ్చర్యపులకితులైరి. దానిని నిర్మించిన ఇంజనీరుల బుద్ధినైశిత్యమును కొనియాడి తాము నట్టి ప్రజ్ఞాధురంధరులగు నింజనీరులు కావలయునని దృఢ ప్రతిజ్ఞలుగొనిరి. మైలునకు మించిన యా కొండ గర్భమును నిరువైపులనుండి ఛేదించి తొలుచుటకు బనివారలను దాని రంధ్రనిర్మాణ కర్తయగు నింజనీరు నియోగించెనట. పని వారు దాని నటునిటు తొలిచికొని వచ్చుచు మధ్యగర్భమున

సమాన రేఖలో నిరురంధ్రములను కలిపి కలిసికొనిరట. ఆంగ్లేయుడైనను నా యింజనీరెంతటి ప్రజ్ఞాధురంధరుడోగదా! పనివార లెంతటి నిపుణులోగదా! బహుళకాలమును గుదించుటకై నిరుప్రక్కల బ్రారంభింపబడిన యీ సమాన రేఖా రంధ్రనిర్మాణ మించుక దప్పినయెడ రెండు రంధ్రము లేర్పడుటయేగాక యెంతటి కష్ట నష్ట ప్రయాసమును జేకూర్చి యుండెడిదో! దానినిజూచి మా సంకల్పించిన విహారయాత్ర చరితార్థమైనదని యెంచితిమి. వార్ధా దాటిన తరువాత ఢిల్లీకి వెడలు రైలుమార్గము నడ్డుకొను వింధ్యగిరుల లోని పర్వతగర్భ మార్గము స్పృహకు వచ్చినది. గుహా మార్గమును దాటినవెంటనే నరసంచారమే లేని నల్లమల యడవికి దరిదాపు నిర్గమనద్వారమై చలమ యను స్టేషను తగిలినది. ప్రవేశద్వారమై మునుముందు మాకు దిగువమెట్ట స్టేషను తగిలియుండెనుగదా!

చలమ యించుమించు గుహామార్గమున కీవలిప్రక్క నటవీమధ్యమున నున్నదని చెప్పవచ్చును. అచ్చట నాకసము నంటిన కొండలు, కొండలపై నెత్తైన నెత్తములు నేత్రపర్వము గొల్పును. అంతియేకాదు, రైలుమార్గము నానుకొని యగాధములై పాతాళలోక ప్రవేశమునకై త్రవ్వ బడిన విశాల విపుల నిమ్న శిలామార్గములో యను పగిది నేటవాలుగ దిగువకు గనుపించు లోయలు చూచుటకు భయావహములై యున్నను మనోహరములై యాకర్షణీ యములై యుండెను. ఈ ప్రదేశ మంతయు క్రూరమృగ సంచార సంకులము కావున నిట బ్రయాణికు లెవ్వరును

దిగరు. రైలు నెక్కరు. కాని కోడ్డును మరమ్మతు చేయు కార్మికులు, నడవిక ట్టెల నెగుమతి చేయు వ్యాపారులును బహు జాగరూకులై బహు సాధనములతో దిగుచుందురని తెలిసి కొంటిమి. దీని సమీపమున నేదేని పల్లెయేని కనీసము చెంచులగూడమేని మాకు బొడగట్టలేదు.

చలమనుండి బండి కీకారణ్యములో నెత్తైన కొండల నడుమగ చిన్న మలుపొకటి తిరిగి యొక చిన్నసొరంగము దూరి దానిని త్రుటిలో దాటి యావల నొక చిన్న మలుపు తిరిగి పదపడి గాజులపల్లె స్టేషను చేరినది.

గాజులపల్లి యరణ్యమునకు వెలుపల గలదు. ఇట భూమియంతయు నెఱ్ఱగ నుండును. ఎఱుకలు మెండు. ఎదుళ్ళు చీల్చి పై పేడు రైలున కెగుమతి చేయుదురు. ఈ పల్లెకు సమీపమున రెండు మూడు మైళ్ళలో మహానంది యున్నది.

మహానంది ముఖమునుండి పెద్ద నీటి ధార వచ్చునట్లు మన పూర్వులు దానిని నిర్మించిరి. ఆ జలములతో నచటి కదళీవనములు, వరిపొలములు ప్రీలబండును. అంతటి జల మెక్కడనుండి యెన్ని గిరిగర్భములనుండి యూరి వచ్చు చున్నదో! ఆ యూటధారను మహానంది ముఖధారగా మన పూర్వులు నిర్మించి భూమిని సస్యశ్యామలముగ నొనర్చు కొనుటయే వింత. భారతీయులు మొదటినుండియు ప్రజ్ఞా వంతులనుటకు ప్రబల నిదర్శనము. పిదప బండి నంద్యాల జేరినది.

నంద్యాల పట్టణము దీని విశాలమగు ప్లాటుఫారము నకు దూరమున దృగ్గోచరమగును. ఇంటిగోడలే యిల్లాలి

సొగసు చెప్పునని సామెత. ఆ యూరి రైలుస్టేషను చూచి నంద్యాల యందమైన పట్టణమని యూహింపవచ్చును. చటి చటి నొక టి. సి. మాయున్నకడకు వచ్చి, "ఇది యాండు వారి పెట్టె. మీరెల్లరు దిగుడు. వేరొక పెట్టెలోనికి పొం"డని యాంగ్లమున నొక విసరు విసరెను. అంత మా జట్టువారియ్యకొనక, "ఆడువారి పెట్టెయయిన గుఱుతు చూపు"మని యాంగ్లమునందే కొసరి వినయమున బలికిరి, పట్టువట్టిరి. టి. సి. గారు ప్రమాణము చూపలేక మరుమాట లేక మఱల మాకు వారి ముఖమైన జూపక పట్టుదలకు దిగక వెడలిపోయిరి. బుద్ధిమంతులు మంచి నంగీకరింతురే గదా? మిథ్యాభిమానమునకు లోనై గిల్లి చెదుకలహముల నిట్టి బెట్టుకొని యైక్యమును గోల్పోవుటకంటె మంచి నంగీకరించి దురభిమానమునకు స్వస్తిచెప్పి సమాజమున శాంతి నెలకొల్పువారరుదుగ నుందురని యా టి.సి. ని యాదర్శముగ విద్యార్థులకు జూపితిమి. అది పెద్దలకును గుణపాఠమేమో? నంద్యాల దాటినపిదప నొకచోట రైలుగోడ్డున కడ్డముగ నొకరస్తా తగిలినది.

ఆరాస్తాయొక్క యొక కొసనుండి బస్సు యాంధ్ర రాష్ట్ర తాత్కాలిక రాజధానియగు కర్నూలునకు బోవునని మఱియొక కొసనుండి బనగానెపల్లెకు బోవునని తెలిసికొంటిమి.

బనగానెపల్లె మామిడిపండ్లకు బ్రసిద్ధి. అవి బంగినపల్లె మామిడిపండ్లని పేర్వడసియున్నవి. ఆ విషయము మా విద్యార్థులు తెలిసికొనిరి.

ఆ రస్తానుండి మాకు మార్గమున పాణ్యాం, బుగ్గనిపల్లె, బేటమంచెర్ల, రంగాపురము మొదలగు స్టేషనులు తగిలినవి. అచ్చట బత్తాయీలు హెచ్చుగ నున్నవి. పాణ్యాంప్రాంతము బత్తాయీలకు బెట్టినదిపేరు. ఇటనుండి బత్తాయిమొక్క లెగుమతి యగును. పిదప మేము ద్రోణాచలము సంధి చేరితిమి.

ద్రోణాచలము రైల్వేజంక్షను. ఇటకు విజయవాడనుండి, గుంటకల్లు మీదుగా హుబ్లీనుండి రైళ్ళు చేరును. ఇచటి నుండి కర్నూలునకు రైలుమార్గమున్నది. విజయవాడనుండి కర్నూలునకు యెక్స్‌ప్రెసు దీని మీదుగా బోవును. ద్రోణాచార్యుడు దీని చెంగటి కొండపై నివసించు కతన దీని కీపేరు వచ్చినదని తత్ప్రాంతీయులైన మా వెంటనున్న ప్రయాణికులు చెప్పిరి. ఆంగ్ల విద్యావాసనా విలసితులైన మా జట్టువారది కట్టుకత యనిరి. "భారత కాలమున ఖాండవవనము మయుడు తక్షకుడు మొదలగు సైంటిస్టులకును — ఏటముబాంబు — హైడ్రోజనుబాంబు మొదలగువానికి మారుపేరులు గల యాగ్నేయ - పాశుపత - వాయవ్య - వారుణ - నాగా స్త్రాదులకును నిలయముగ ఫ్యాక్టరీగనున్న సమయమున ద్రోణుడీద్రోణాచలము కొండమిట్టను మెట్టియుండ రాదా? యందుచే దీని కీపేరు వచ్చియుండగూడదా?" యని తత్ప్రాంతీయులు వాదించిరి. ఆంగ్లవిద్యా విలసితులవాదమో యార్యపరంపరాశ్రుతమగు తత్ప్రాంతీయులవాదమో యేది సత్యమో? పాశ్చాత్యులు వ్రాసిపెట్టినగాని మనకు జరిత్ర లేదు. తుదకు మనకు దలిదండ్రు లెవరో పాశ్చాత్యులు

చెప్పినగాని విశ్వాసము కలుఁగదేమో! జర్మనులు, రష్యనులు, నాంగ్లేయులు మున్నగు పాశ్చాత్యులు సంస్కృత భాషలోని వేద భారత రామాయణాది శాస్త్రగ్రంథములు తమ తమ భాషలలోనికి ననువదించుకొని వాని మహిమ నుగ్గడించుచుండగ నిపుడిపుడే కనుదెఱచుచున్న మహానుభావులు మన యాంగ్లవిద్వాంసులు. అయినను మన భారతీయాంగ్ల పండితుల కాంగ్లేయుల వ్రాతయే శిరోధార్యము ఉరోహార్యము. వీరశివాజీని దోపిడిగాడని కొండ యెలుక యని పలికిన పలుకు వీరికి వేదవాక్కు. భారతీయులకు జరిత్రయే లేదని వ్రాసిన కొందఱి యాంగ్లేయుల యసమర్థపు వ్రాత నాంగ్లములో బూర్ణపాండిత్తిలేని మనవారు కొందఱు నమ్మెదురు. అసలు పరప్రత్యయనేయబుద్ధులయినవారికి సిసలైన విషయముపై గూడ ప్రత్యయముండదు. అట్టివారి జోలి మనకేల? మా బండి ద్రోణాచలము వీడి గుంటకలు జంక్షను చేరినది.

గుంటకలు జంక్షను రమ్యమైనది. దీనిని జేరులోపల మేము నాలుగైదు స్టేషనులు దాటివచ్చితిమి. పట్టణములోనికి బోవుటకు మాకు వ్యవధి కలుగలేదు. కాని కంథమునుండి గుంటకలు వఱకుగల ప్రకృతి సౌందర్యము మమ్మానందపఱచినది. మానవ సౌందర్యమునుగూడ నపహరించి ప్రకృతి తనలో లీనమొనర్చుకొన్నదేమో యన్నట్టు లటగల మానిసులంత రూపసులు గాకయుండిరి. వారు తాలనఱగింపజాలు కార్మికతాపసులైన గావచ్చును. గుంటకలు సంధిలో నిరువురిని సామానులకు గాపుంచి తక్కినజట్టు స్టేషనులోగల

కర్నాటక భోజన వసతిగృహమునకు బోయినది. ఆ భోజనము మాయంతేవాసులకు రుచింపలేదు. క్షాత్రప్రవృత్తి గలవారికి జప్పిడి మెతుకులు రుచింపవుగాబోలు! మృగరాజు గడ్డి మేయునా! యని మా విద్యార్థులొకరినొకరెకసక్కెము లాడుకొనిరి.

గుంటూరు విడిచినది మొదలు గుంటకలు సంధివఱకును మేము హాయిగ రైలుప్రయాణ మొనర్చితిమి. మాది "ఎక్సకర్షన్ పార్టీ" యని చెప్పిన మాత్రమున మమ్మెవ్వరికి యెవరికి వారు సగౌరవముగ తక్కిన పెట్టెలలోనికి వెడలి పోవుచుండెడివారు. మా జట్టు పెద్దది. అయినను, నందుచే మా కూరుచున్న పెట్టె మాకు మా సామానులకు గొంతకు గొంత హాయిగ సరిపోయినది. మా జట్టువారును బహు జాగరూకులై యితర ప్రయాణికులకు నవసరమగు నెడ జోటొసగి గౌరవము చూపువారు. గుంటకలులో నట్లు కాదు.

భోజనవసతి గృహమునుండి మేము వచ్చినతోడనే మా స్థానముల నితర ప్రయాణికు లాక్రమించుకొనిరి. రైలు బండి క్రిక్కిరిసినది. దినకరు డస్తమించినాడు. కన్ను పొడిచికొని చూచినను ప్రకృతిశోభ కనుపించుటలేదు. కాలక్షేపమున కవకాశములేదు. ఇట్టి పరిస్థితులలో నిలువు గాళ్ళపై కొందఱు మోకాళ్ళపై కొందఱు మా జట్టువారిటులుకొని రైలుగర్భమున నిమిడిరి. మాకు సహింపరాని బాధకలిగినను సోదర ప్రయాణికుల కొక్కింత సాయపడితిమనెడి యానందము మాత్రము మమ్ము సుఖింపచేసినది. ఇంతదనుక తనివిదీర ప్రకృతిశోభను గాంచియుండిన విద్యార్థు

లలసి సొలసి నిద్రా దేవీ యుత్సంగమున బుజ్జగింపబడుచుండిరి. జేనెడు బెత్తెడు స్థలములలో నిఱుకుకొని యొకరిమీద నొకరు పడి నిద్రించుచున్న మా విద్యార్థుల విశాలబుద్ధిని చీకటినెలత తన విద్యుద్దీప విశాల శతనేత్రములతో విలోకించి యచ్చెఱువందుచుండెను. సోదర ప్రయాణికులకు సాయమొసగుట కళ్యాణక్రియ యగును. సోదరులును గొంత వఱకు విసుగెత్తించెడి నిరర్థక ప్రలాపములతో దోడిప్రయాణికుల బాధించుట యనుచితము.

మా పెట్టెలోని కెక్కిన కొందఱు, చదువుకొనని వారి మాట యటుంచుడు, చదువుకొనినవారే నాగరికత విలసితులై కన్పించుచున్నట్లున్నవారే పెద్ద చదువులు చదివితిమని భావించుకొనుచున్నవారే సోదర ప్రయాణికుల మెదడులు పాడైపోవునని తలపక పెద్ద కంఠములతో కొన్ని గొడవలు లేవదీసిరి. రైలుపెట్టెలు పల్లెటూళ్ళలోని ఒడాయి రచ్చబండలనియో రాజకీయ పార్టీల యొక్క రంగస్థలములనియో కూరగాయలకై దెబ్బలాడు సంతబజారులనియో కసాయి దుకాణములనియో హుషారు చూపి తమ ప్రత్యర్థులపై దూకు నింటి ముంగలి పాటిదిబ్బలనియో భావించిరి. బూతు కబురులు, నుడుకుబోతు తనములు, బండమాటలు, కాడీ చేష్టలు, కసిదీరని యెగిరిపాటులు నవి యివి యననేల? త్రాగిన వారివలె నసందర్భముగ లోకమును విమర్శించు వ్యర్థప్రలాపములు నీ గురిగింజ జాతి మానవుల నోటినుండి హద్దులేక మురికి కాల్వలవలె ప్రవహించినవి. ఇంటజెల్లనివా మూరంతటిని విమర్శించునేగదా! వలదందుమా మీద

బడుదురు. ఊరుకొందుమా – మా చెవులు సహింపకున్నవి. ఈ గురిగింజజాతి మానవుల కెట్లు గుణపాఠము నేర్పుటో నేటికిని దెలియకున్నది. కాలము మాకు సాయపడి రైలు మా మీద దయదలచి వారి నటనట ద్వరత్వరగ దింపి మా యుబ్బుకుడుపును మాన్పినది. బండి బళ్ళారి చేరినది.

## ఐదవ మజిలీ

## బళ్ళారి మండలము

బళ్ళారి తెలుగువారి పట్టణము. బళ్ళారి నగరవాసులకు — వారికే కాదాంధ్రప్రజానీకమునకు జరిగిన యవమానములు నన్యాయములు నసముచిత నిర్ణయములు హృదయమున శల్యములై వేధించినవి. పూర్వస్మృతులెన్నో హృదయరంగమున గుస్తీపట్టినవి. అది యాంధ్రుల పట్టణమని యెన్ని నిదర్శనములు చూపగలము? సముద్రములోని జల మెన్ని కణములని లెక్కింపగలము? మిశ్రాగారి నిర్ణయమునకు నాంధ్రుల నానావిధ నాయకత్వమునకు కేంద్రప్రభుత్వము దుర్నయమున కొడిగట్టి దానిని బలియొనర్చినది. ఇంతకన్న దానినిగూర్చి నా కిపుడు పలుక వలనుపడదు. కాని మహాత్ముడు సాగించిన యుప్పు సత్యాగ్రహములో బాల్గొని దేశ స్వాతంత్ర్య సముపార్జనమునకై పోరాడి యాంగ్లప్రభుత్వ నిరంకుశ చర్యలకు గుఱియై బంధింపబడి యుటకు గొని

రాబడినవారిలో నేనొకడనై నాడు పొందిన నా బళ్ళారి క్యాంపుజైలులోని యనుభవము నన్నొకమారు ఱొడలు పులకింపజేయక మానలేదు. అట్టి మధురస్మృతులలో నే నుండగనే "నాకు ముక్కోటి యాంధ్రవీరపుత్రులుండియు నా మొఱాలింపక నన్ను రక్షింపక పరులపంచల తలదాచు కొమ్మని వీడిరి. అట్టి యాంధ్రయోధమ్మన్యులకు ముఖము చూపుట నాకే సిగ్గువైచుచున్నది;" అని చాగినదో యను నట్టు లాంధ్రనగరమగు నా బళ్ళారి చీకటిమఱుగున మాకు గన్పింపక దాటిపోయినది. అంతట మాలోని పెద్దలుకూడ నిద్రాదేవీగాఢోపగూహనమున జొక్కి గుఱకలు గొట్టిరి. బండి యాగినది. హాస్పేట యనిరి.

హాస్పేట ప్లాటుఫారమునుండి, హాంపీవిహారయాత్రకు మావలె వచ్చి క్రమ్ముచుండినవారు కాబోలు, వింత వింత లైన దుస్తులు ధరించి యజ్ఞోపవీతస్థానమున ప్రాస్కులు వ్రేలాడుచుండ బొంగులువారెడి యౌవనములో నున్న యువకులు కొందఱు తమ ప్రక్కచుట్టలను బండిలోనికి విసర మొదలిడిరి. మా సామానులు వారి దాడికాగలేక తలలు వంచినవి. పిదప నెమ్మదిగ మా సామానులేరి క్రిందికి దింపు కొంటిమి. యౌవనము కడుదొడ్డదిగదా! ఎట్లో మా జట్టు బాలురను ప్లాటుఫారము మీదికి దింపితిమి. అర్ధ నిద్రా నిమీలితనేత్రులై యున్న ప్లాటుఫారము మీద నే పక్కచుట్టలు పఱచుకొని వారి కనువగు తావులందు గొట్టిన పాములవలె పడి వారు నిద్రవోయిరి. నాకు సమీపమున నే మా జట్టున కేలి కయు (Leader) నన్న దాతయునైన శ్రీ రఘురామయ్యగారు

నిద్రించిరి. వచ్చిపోయెడి రైళ్ళుకూడ మాకు నిద్రాభంగము కలిగింపలేకపోయినవి. నిద్ర సుఖమెఱుగనిదిగదా!

రజనీకామిని మెలమెల్లన బగటి తెఱవకు మమ్మప్పగించి యల్లనల్లన జరిగిపోయినది. కమలబాంధవుడు సహస్రకిరణ కరనికరము సాచి విశాల విశ్వాలింగన మొనరింప జొచ్చెను. మమ్మతడు లేపియుండనోపు. కాల్యకృత్యములు తీర్చుకొని బాడుగ బండిని మాట్లాడుకొని దానిపై సామానులు వైచుకొని మిగిలిన సామానును చేతగొని హాస్పేట లోని ముసాఫరుఖానాకు బయలు దేరితిమి. ఎక్కడ జూచిన ద్రోవకిరువైపుల నిక్షువనములే. ఇక్షుపర్వములలోని సార మాధుర్యమే యటగల ప్రజల హృదయములందు కలదేమో? వారు మమ్ము సగౌరవముగ నాదరించెడివారు. హాస్పేటలోని ముసాఫరుఖానా చేరితిమి.

ముసాఫరుఖానాకు గట్టిపేళ్ళు మొదలుకొని గడ్డ పెరుగువఱకు విక్రయమునకు వచ్చును. వంటపాత్రలు సత్రమువారొసగుదురు. సత్రములోపల నుప్పునీటి బావియు వెలుపల మంచినీటి బావియు కలవు. లోపల కశ్మలము వెలుపల నున్నపు గచ్చుగల సమాధివంటిది మాత్రమది గాదు. సత్రము వెలుపలనున్న హాస్పేట మధురముగ నుండునని దీనినిబట్టి మేము భావించితిమి. దానిని దర్శించుటకు వెళ్ళితిమి.

హాస్పేట చాల చిన్న పట్టణము. అయినను కడు రమ్యమైనది. స్టేషనుకు కరమైలు దూరమున నున్నది. ఇక్షువనముల వలన దూరమనిపింపదు. స్టేషనునకు హాస్పేటకు

నడుమ తుంగభద్ర కాలువ జాలువారును. దానిపై వారధి గలదు. చుట్టునుగల పైరుపచ్చలు చూచుట కెంతో మనోహరముగ నుండును. ప్రజలలో నందచందములు గాన రావు గాని పరుల నాదరించుటలో వారి దండెవేసిన చేయి. క్రొత్తవారేదేని నడిగిన జక్కగ సమాధాన మిత్తురు అట్టి స్వభావము ప్రతి దేశమున కవసరము. అమూల్య మానవత్వ మటగల ప్రజలలో మూర్తీభవించి యున్నది. ఒక్కమాట చాలు. వారు మర్యాదగల మానిసులు.

నాటికి మేము ముసాఫరుఖానాలోనే బసచేసితిమి. మా జట్టులోని కొందఱు తుంగభద్రకాలువలో నీళ్లాడిరి. నడువవెఱచిన పెద్దలు బావియొద్దనే జలకమాడిరి. వంట తయారైనది. హాయిగ భుజించి లేచితిమి. ఇచట నొక విషయము చెప్పక తప్పదు. చాటుమాటున సిగరెట్టు బీడి సమిధలు వెలిగించు మా జట్టువారు కొంద ఱాపూట తెగించిరి. నాకు విసువు కోపము వచ్చినవి. నేటి సమాజములో సభ్యతాసంస్కృతులు మా ముఖముననే వెలసినవని విఱ్ఱ వీగు విద్యాధికులే యీ దురభ్యాసమునకు లోనగుచుండ మా జట్టువారిని నే నేమని మందలింపగలను? అదియుగాక దూర దేశమది. వారి కాదర్శముగ నేను గన్పడిన జాలు ననుకొంటిని. నా యుద్దేశము వారు గ్రహించిరి. ఇక మా ప్రయాణములో వారి ముఖములు పొగ ద్రాగుటచే బొగబారిన వంటయిండ్లవలె నాకు గన్పింపలేదు. మే మందఱము తుంగభద్రప్రాజెక్టు తిలకింప నుత్సుకులమై యుంటిమి. అటకు బస్సు బయలు దేరినది. సిద్ధముగనున్న

మేమందు గూరుచుంటిమి. హాస్పేటకు దుంగభద్రడాము మూడు మైళ్ళు.

బస్సు నిలిచినది. డాము ప్రాంతమున దిగితిమి. అట వర్కుషా పున్నది. దీనికి మూడు నాలుగు ఫర్లాంగులలో డామున్నది. డామువఱకు మంచిరోడ్డు గలదు. కాని మా బస్సునకు పరిమిషను లేదట. అందుచే వర్కుషాపు కడ దిగిన మేము డామునకు బ్రయాణమైతిమి. ఎట్టయెదుట ను వ్వెత్తుగ గాన్పించుచున్న తుంగభద్ర డాము మమ్మెంతో మురిపించినది. మిత్రాగారి తీరు పాంధ్రుల కెంత ముప్పు తెచ్చినదో మా కెఱిగించినది.

తుంగభద్ర కొండల నడుమగ నున్నది. ఇరువాగుల కొండలే. ఇద్దరి మైసూరు ప్రభుత్వము, అద్దరి నైజాము పరి పాలనము, మధ్యలో దుంగభద్ర. తుంగభద్ర కిరువైపుల నున్న నెత్తైన కొండలు బారలు సాచిన తుంగభద్ర యొక్క సుదీర్ఘ హస్తములవలె నటునిటు వ్యాపించియున్నవి. కొండ లకు వెనుక విశాలమైన భూభాగమున్నది. కొండలను గలిపి తుంగభద్రలో దరిదాపు నూటడెబ్బదియై దడుగుల యెత్తున నించుమించు నిరువది యడుగుల మందమున గొప్ప సిమెంటు గోడ నిర్మింపబడి యున్నది. ఆ గోడకుతట్టి తుంగభద్రా ప్రవాహము కొండలకు వెనుకతట్టున నున్న మైదానమును నింపి మహాసముద్ర మొనర్చినది. దీనినే తుంగభద్ర రిజ ర్వాయరందురు. డాముపై నవశేష మింకను బూరింపబడు చున్నది. డాము బండ్లు తప్పుకొని పోవుటకు వీలైనంత వెడల్పు రోడ్డుతో నున్నది. అది యెక్కిచూచిన నలలు

తన్నుచున్న యపారపారావారమువోలె దుంగభద్ర కన్పట్టును. అచటిరైతుల కేనాటికిని నీటియెద్దడి రాదని గోచరించును. డామునకు నైజాముప్రక్క నొక కాలువ మైసూరు ప్రక్క నొక కాలువ గలవు. కాల్వ గచ్చుకాల్వ. కలకల ధ్వనితో నీడ కనుపించు నీరందు ప్రవహించుచుండును. మైసూరు ప్రక్క కాలువను దిగువకాలువయని నేడు పిలుచుచున్నారు. మైసూరు ప్రక్కనున్న తుంగభద్రాతీరగతమగు నెత్తైన కొండదరిగ కాలువ నేర్పాటుచేసి తన్మూలమున రాయలసీమలోని యనంతపురము కడపజిల్లాలును సస్యశ్యామల మొనర్పవలయునని ప్రణాళిక రచించిరి. దీనినే యెగువకాల్వయని యనుచున్నారు. కాల్వకు, దుంగభద్రకు, గొండలకు జేరిన రోడ్లు మిగుల నందముగ నున్నవి. అచటి సిబ్బందివలన నట నొక గ్రామమేర్పడినది. ఎచట జూచిన రోడ్ల కిరుప్రక్కల రకరకముల పూలమొక్కలు. అవి పలు రకములగు నాకృతులతో నలరుచున్నవి. తుంగభద్రయొక్క డామునకు దిగువభాగమున దాదాపు మైలు దూరములో నొక వంతెన గలదు. అది మైసూరు ప్రాంతమును నైజాము ప్రాంతముతో గలుపుచున్నది.

అట్టి చక్కని రోడ్డొకటి కొండమీదికి బోవును. వారించుచున్నను వినక మా జట్టులోని బాలిక లిరువురు పుష్పాపచయ మొనరించి బాల్యచాంచల్యముతో బాటు స్త్రీజనోచిత స్వభావమును వెల్లడించిరి. తమ యందమును మించిన సౌందర్యమును గాంచి స్త్రీలు సహింపనొల్లరుగదా!

కాని మా బాలికల వయస్సొకరిది పదేండ్లు. మఱొకరిది పదునొకండేండ్లు. అవి ముద్దుచేష్టలు.

తుంగభద్రడాముమీదికి జేరియున్న మా జట్టు దాని సౌందర్యమునకు ముగ్ధస్నిగ్ధమైనది. విద్యార్థులు సంతోషాతిరేకమున గంతులువైచిరి. సౌందర్యముమాట యటుంచుడు. ఇంజనీరుల చాకచక్యము కార్మికుల కఠోర కఠిన పరిశ్రమము తలచుకొన్న మా హృదయము తుంగభద్రరిజర్వాయరైనది. కొండమీది లైటుహౌసును జూడ నుబ్బులాతలూగితిమి.

లైటుహౌసుకడకు వక్రమార్గమున కొండపై కెగబ్రాకితిమి. పిల్లలజట్టు పెద్దవారి జట్టును వెనుకకు నెట్టి చటు చటు ముందున కెగబ్రాకెను. నిరాయాసముగ నిర్బాధకముగ కొండనెత్తము జేరి బాలరక్తములో సత్తిని సత్తాను ఋజువుపఱచిరి. అవకాశమేని నభ్యాసమేని లభించిన నెందఱుపిల్లలు గౌరీశిఖరము నధిరోహించిన షేర్పాటెన్ సింగ్ నారేలుగా దయారగుదురో? కఠినశిలాకర్కశమగు కొండ వికసితసుమవిసరభరితవృక్షజాల సంశోభితమై యున్నది. అంతపని చేసిన మానవుడికెంత చేయలేడు? పర్వత తను వెల్లెడ బూలతోటలు, నందమైన కాలిబాటలు, పంపునీటి యూటలు, కారులు వలయముగ దిరిగిపోవు రోడ్ల చోటులు వెలసి కనులపండు వొనర్చును. బుద్ధిజీవులు శ్రమజీవులు వివాదపడక సహకరించుకొనిననా డెన్ని కొండలు వాస యోగ్యములగునో? ఎన్ని విచిత్రము లావిర్భవించునో?

కొండ నెత్తము జేరితిమి. అక్కడ జక్కని బిల్డింగున్నది. దానిచుట్టు పెద్ద విశాలమగు ప్రమదవన మున్నది. తుంగభద్ర తన నీరు గొట్టములగుండ నటకు బంపుకొన్నది. తనివితీరక పదిగంటలవఱకు నక్కడనే కాలము పుచ్చితిమి. మా జట్టులోని త్రిపురసుందరి పదేడులైనను నిండీనిండని బాలిక. పేరునకు దగిన సుందరసుకుమారి. తెలివికి దీటైన సాహసము గలది. కొండనెక్కుటలో బెద్దవారికేమియు దీసిపోలేదు. మా తిరిగిన తావులెల్ల విసువక తిరిగినది. పర్వతాగ్రమునగల పుష్పవనములోని విహారముతో దనివి చెందక యామెకు నచ్చినపూవులు పుణికి ముచ్చట దీర్చుకొన్నది. ఏకాదశాబ్దముల బాలిక యొకర్తుక కలదు. పేరు పట్టవర్ధని. ఆమెయు విసువుజెందక విసిగింపక మాతోపాటు కడుసాహసముతో దిరిగినది. "మాష్టరుగారూ! మనమందర మీ కొండమీదనే యుండిపోయిన నెంత బాగుండునండీ" యని యాప్రదేశముపై దనకుగల మక్కువను వెల్లడించినది. "ముదితల్ నేర్వగరాని విద్దెగలదే ముద్దార నేర్పించినన్" అని మేమనుకొంటిమి. సుందరములైన కుర్చీలతో నున్న కొండమీది భవ్యభవనమును జూచి "ఇది మన హైస్కూలు బిల్డింగైన నెంత బాగుండునండీ!" యని యొక విద్యార్థి కిశోర మనియెను. అంతటి యందమగు కొండను దిగవలసి వచ్చినది. మా జట్టును లెక్కించితిమి. కాని మానరేంద్రుడు కాన్పింపలేదు. మాజట్టులో నందఱికంటె చిన్నవాడతడే. వయసు పదియేడులకు లోపు. కేకలు పెట్టితిమి. సమాధానము లేదు. బిల్డింగు వెనుకకు వెళ్ళి వెదుకగ నొక నీటిపంపు

నొద్ద నాడుకొనుచుండెను. ఆటలో నంతయు మఱచి యుండెను. ఒకరు వెళ్లి వీపు వేసినగాని యథాస్థితికి రాలేదు. "ఇక్కడ చాల హాయిగనున్నది. నీరువచ్చుపద్ధతి వింతగ నున్నది. మీరు నడువుడు. నేను వత్తును." అనుచు మేము దూరమగుటజూచి లేచి పరుగిడి మాజట్టులో గలిసినాడు. సునాయాసముగ సురక్షితముగ కొండ దిగితిమి.

తుంగ, భద్ర యను రెండునదులు పశ్చిమకనుమలందు బుట్టి మైసూరుప్రాంతమునగల కుడ్లి యను చోట నివి రెండును కలిసినవి. తుంగభద్ర మైసూరుప్రాంతమునందు నలువది యైదు మైళ్లు ప్రవహించి కృష్ణానదిలో గలియుచున్నది. హగరి, హంద్రీనదులు తుంగభద్ర కుపనదులు. ముని మొదట మద్రాసు నైజాము ప్రభుత్వము లాలోచించి 1915 వ సంవత్సరమున ప్రాజెక్టు నిర్మాణమునకు బరిశీలనలు గావించిరి. పిదప 1944 వ సంవత్సరమున నా రెండు ప్రభుత్వము లానకట్ట నిర్మాణమునకు బూనుకొన్నవి. ఈ యానకట్ట పొడవు దాదాపు మైలున్నరయుండును. దీని రిజర్వాయరు విస్తీర్ణము రమారమి నూటడెబ్బది మైళ్లుండును. దీనిక్రింద సాగుకాగల భూమి విస్తీర్ణ మిరువదిలక్షల యెకరములు.

తుంగభద్రప్రాజెక్టు ప్రాంతమున రకరకములగు పంటలు పండును. తుంగభద్ర దిగువకాల్వక్రింద నాంధ్ర దేశమున నున్న పొలము 1,56,000 యెకరములు సాగగును. మైసూరురాష్ట్రమునందు, నాంధ్రప్రాంతము నందును గలిసి 2,50,000 యెకరములు సాగగును.

ఆంధ్రప్రాంతమున సాగయ్యెడి భూమి కర్నూలుజిల్లాలోని ఆలూరు, పత్తికొండ, కర్నూలు, ఆదోని తాలూకాలలోగల రెండువందల పదునొకండు గ్రామములకు జెందియున్నది. ఈ ప్రాజెక్టుక్రింద నాంధ్ర మైసూరు రాష్ట్రములందు గలిపి 60,000 టన్నుల యాహారపదార్థములు, 40,000 టన్నుల ప్రత్తి వేరుసెనగవంటి వ్యాపారిక సస్యములును ఫలింపగలవని నిపుణుల యంచనాలు తెలియజెప్పుచున్నవి.

ఎగువకాలువ నిర్మింపబడలేదు. దాని నిర్మాణానంతరము 3,80,000 యెకరముల పొలము సాగు కాగలదట. అనంతపురముజిల్లాలోని 1,85,000 యెకరములును, కడప జిల్లాయందు 1,15,000 యెకరములు, నిటీవల మైసూరు ప్రాంతమునకు బదిలీచేయబడిన ప్రాంతమునందు 80,000 యెకరముల పొలము సాగుకాగలదని నిపుణులు ప్రకటించిన దానిని మా విద్యార్థుల కెఱింగించితిమి. ఎగువకాల్వకు సుమారు పందొమ్మిదికోట్ల రూప్యములు వ్యయమగును. నందికొండ ప్రాజెక్టునకు వ్యయము నూటయిరువదికోట్లు. దీనిక్రిందనగు సాగు ముప్పదిలక్షల యెకరములు. ఎగువ కాల్వ సాగు దీనికంటె జాల స్వల్పము. ఈ రెంట నేది మీకు వలయునని కేంద్రప్రభుత్వ మాంధ్రప్రభుత్వము నడిగినది.

"అల్పస్య హేతోర్బహుహాతు మిచ్ఛన్ విచారమూఢః ప్రతిభాసి మేత్వమ్'

అని కాళిదాసు చెప్పినట్లు కేంద్రప్రభుత్వ మాంధ్రప్రభుత్వమును బ్రశ్నించుచున్నను లెక్కగొనక నాటి దిలీపునివలె

నాంధ్రప్రభుత్వము నందికొండను విడనాడి యెగువకాల్వను నాదరించుట మాన లేదు. పిదప వర్కుషాపును బరిశీలించితిమి.

వర్కుషాపులో పెద్ద పెద్ద యినుపదూలములు విద్యుత్తు సహాయమున సులువుగ బైకెత్తి కోసి గుట్టలు వేయబడు చుండెను. మాలోనుండి యానందాశ్చర్యములు వెలి కుబికినవి. ఇట్టి కర్మాగారము భారతవర్షమున మరెచ్చటను లేదు. ఇం దనుభవజ్ఞులైన కార్మికులు పనిచేయుచున్నారు. అనంతర మొక హోటలు చేరి వలసిన పదార్థములు భుజించితిమి. క్రమ్మఱి హంపీకి బయలు దేరితిమి.

## ౧౨వ మజిలీ

# హంపీ విజయనగరము

హోస్పేటకు పూర్వనామము నాగలాపురమట. నాగలాదేవి నామమున నీ గ్రామము నిర్మింపబడినదట నాగలాదేవి కృష్ణదేవరాయల యుంపుడుకత్తె యందురు. ఈ హోస్పేటనుండి హంపీకి చక్కని విశాలమార్గ మున్నది. ఇది పూర్వము హంపీకి వెడలు సువిశాల రాజవీధియట. దీని కిరుప్రక్కల నేడు శిథిల దేవాలయ మంటపములు, రచ్చలు కన్పట్టును.

హంపీ హోస్పేట కెనిమిది మైళ్ళు. కన్నడమున బంపను హంపి యందురు. పంపాసరోవర తీరమున నున్న పుణ్య క్షేత్రముగాన దీనిని పంపాక్షేత్రము హంపీక్షేత్రమునని

చెప్పుదురు. తుంగభద్రకు బంపాసరోవరమునకు నడుమ మైలు పై మేర యుండును. తుంగభద్రనది యొడ్డున విరూపాక్ష దేవాలయ మున్నది. దానికి ధర్మకర్త మాధవవిద్యారణ్య స్వామివారు. కాకతీయ సామ్రాజ్య పతనానంతరము హరిహర బుక్క రాయ సోదరులు మహమ్మదీయ విజృంభణము నరికట్టదలచి యానెగొంది జంబుకేశ్వర రాయలను జేరి కొన్ని చిక్కులు పడసి యానెగొంది పతనానంతరము మాధవవిద్యారణ్యస్వామివారి సహాయమువలన విరూపాక్ష దేవుని శ్రీభాండారమును వెచ్చించి సైన్యములు సమకూర్చి యాంధ్ర కర్నాట మళయాళ వర్గములను కూడగట్టుకొని మహమ్మదీయ మతజాతి నోడించి దేవగిరివఱకు వెనుకకు నెట్టి పంపా తుంగభద్రా మధ్యక్షేత్రమున స్వామివారి పేర విద్యానగరమును నిర్మించిరి. అదియే విజయనగరమై విజయనగర సామ్రాజ్యమునకు రాజధాని యైనది. అది దానిపాలకులలో ముఖ్యులగు ప్రౌఢరాయ కృష్ణరాయ రామరాయాది వీరయోధుల వలన మహోన్నతస్థితిని బొంది తళ్ళికోట యుద్ధముతో విజయనగరసామ్రాజ్య మస్తమించినది. దానిని హంపీశిథిలములని నేడందురు. అట్టి హంపీకి మాబస్సు కదలినది.

బస్సు పత్తనవీధుల నతిక్రమించి తుంగభద్ర కాల్వ నుత్తరించి యిక్షువనములమధ్య శిలామార్గమును దూసి కొనుచు పోవుచుండెను. ఒకచోట బస్సాగినది. మార్గమునకు ప్రక్క గాజుల దండలు వ్రేలుచున్నవి. అట గాజులమ్మ యుండు నట. భారత దేశములో మానవ సంఖ్యతో దైవముల సంఖ్య

పోటీపడి పెరుగుచున్న దనుకొంటిని. మానవునకున్నరుచు లే దైవములకు నుండును గాబోలు? అంతకన్న మిన్నరుచులు నుండుననవచ్చును. పెంద్రుకలమీది ప్రీతి వెంకన్నకు, పానకము మీద మనసు నరసింగన్నకు, వేటలమీద ప్రేమ పోతన్నకు గలదు. అట్లే గాజులపై మోజీ యమ్మకుండి యుండును. "లోకోభిన్నరుచి" యన్నారు గదా పెద్దలు? బస్సు క్రమ్మఱ బయలుదేరినది. కమలాపురము చేరితిమి.

కమలాపురము నానుకొని గొప్ప చెఱువున్నది. దీని క్రింద నాలుగువందలేబది యెకరములు సాగగునట. కమలాపురము చిన్న గ్రామమే. చూచుటకందమైనది. యాత్రికులకు భోజనశాల గలదు. పోలీసుస్టేషను గలదు. పోస్టాఫీసును గలదు. బంగళాకూడ నున్నది. ఇచ్చట హంపీ విజయనగర శిథిల చిత్రములు, మ్యాపులు, పుస్తకములు నమ్ముదురు. కమలాపురమునకు దూర్పుదిక్కున మార్గము బళ్ళారికి గలదు. ఆ మార్గమునం దరమైలు దూరమున బట్టాభిరామ దేవాలయము గలదు. ఇది హంపికి నాగ్నేయమున నున్నది. హంపికి వాయవ్యమున విరూపాక్ష దేవాలయ మున్నది. ఆ ప్రాంతముననే హంపీ సింహద్వార మున్నది. మే మా సింహద్వారమున హంపీలో బ్రవేశింపలేదు.

మేము నాంధ్రులమే. కృష్ణరాయలు మా పూర్వ పురుషుడే. కాని కాలములోని మార్పు మాలోను బ్రవేశించినది కాబోలు! బస్తరును, గంజామును, జెన్నపురమును, బళ్ళారినగరమును వరుసగ గోలుపోయిన యాంధ్రుల మగుట నేమో కృష్ణరాయలు పరిపాలించిన హంపీ విజయ

నగరమును సింహద్వారముగుండ ప్రవేశించుటకు జంకి యాతని రాణులు స్నానమాడిన యంతఃపురమునకు బోవు దొడ్డిత్రోవను హంపీలోనికి బ్రవేశించితిమి. దొడ్డిత్రోవకడ హంపీ బజారునకు విజయనగర రాజమార్గమునకు బోవు విశాలమార్గములు గలవు. వాని దూరమును దెలుపు చెక్కలట గట్టబడి యున్నవి.

ఈ దొడ్డిత్రోవలో నొక ద్వారము కలదు. దానిని భీమద్వార మందురు. అట నొకరాతి విగ్రహముగలదు. చూచుట కది భీకరముగ నుండును. దాని కను లెఱ్ఱగ చింత నిప్పులవలె గన్పట్టును. ఆనాటి రం గీనాటికిని చెడలేదు. ఈ ద్వారమున నొరు లెవరును బ్రవేశింప నలవిగానిరీతి భీమ బలులగు సైనికు లిట గావలియుండెడివారట. దాన దీనికి భీమద్వారమని పేరు వచ్చినదట. భీముడను పేరుగల సైనిక భటు డిచట గాపలా యుండువా డనియు మీది రాతివిగ్రహ మతని దే యనియు గొందఱందురు. దీనిని గాంచినపుడు లాహోరునకు నలువైపుల గల భయంకర సింహద్వారములు తలపునకు వచ్చినవి. ఈ ద్వార మిపుడు చాల శిథిలమై పోయి నది. ఈ ద్వారమునకు నుత్తరముగ గానుగమ్మ దేవాలయము గలదు. దానిని జూచితిమి. దానికి బడమర ప్రక్కగ నుత్తరమునకు నానెగొందికి బోవు మార్గము గలదు. ఆ మార్గమును దాటి రాణులు స్నానమాడిన మందిరమునకు వచ్చితిమి. అది గానుగమ్మ గుడికి నించుక దక్షిణముగ బడమర దిక్కున నున్నది.

ఈ మందిరములోపల స్నానాల కోనేరు గలదు. రాణులు బట్టలు తగిలించుకొను కొక్కెముల రాళ్ళు నేటికి నున్నవి. దరిదాపిది యైదారడుగుల లోతున్నది. దీని చుట్టును సుందరమగు భవనము గలదు. నెక్కుడుగ దీనిలో మహమ్మదీయ వాస్తుకళ గోచరించును. తుంగభద్రనుండి రాలతో జెక్కబడిన నీటికాలువ యీ కోనేటిలోనికి గలదు. మొత్తము కాలువ యొకేరాతితో మలచినట్లుండును. కాల్వ తుంగభద్రనదియొక్క నీటిమట్టమునకుసరిపోవు దిమ్మలున్నవి. కాల్వ శిథిలమైనను మందిరము సొగసు తరుగలేదు. ఆ నాటి ఇంజనీరుల యాలోచనా పటిమ మెచ్చదగినది. ఈ మందిరమునకు నుత్తరమున మహార్నవమి దిబ్బ లేక దసరాదిబ్బ యున్నది.

ఈ దసరాదిబ్బపై నావరణ మేమియు లేదు. ఇది రమారమి పదునైదడుగుల యెత్తుండును. పొడవు డెబ్బదియడుగులు, వెడల్పు ఇరువదియడుగు లుండును. దానిపై కెక్కుటకు శిథిలముగాని మెట్లు గలవు. దీనిచుట్టు నపూర్వమగు రాతి శిల్పము గలదు. ఈ బొమ్మలు వివిధభావస్ఫోరకములుగ నున్నవి. దీనిని 1518 సంవత్సరములో శ్రీకృష్ణదేవరాయలు కట్టించెనట. రాయ లిట విజయదశమినాడు పేరోలగ ముండెడివాడట. దీని చెంగటనే రాజదర్బారు దిబ్బ గలదు.

రాజదర్బారు దిబ్బ యొక యెత్తైన కట్టడము. దీనిపై గూడ నావరణము లేదు. దీని చుట్టును శిల్పము గలదు. దీనిపై సామంతరాజులను గూడి కృష్ణదేవరాయలు కొల్వుండెడివాడట. కొలువుకూటమునకు పైభాగమున నావరణము

లేకుండుటకు గారణ మేమై యుండునో? పై కప్పు పడిపోయిన చిహ్నములైనను గోచరింపవు. దసరాదిబ్బకు సమీపమున నుత్తర భాగమునం దొకే రాతితో జేసిన తలుపు పడియున్నది. రెండప దేమైనదో? ఇది దేనిదో? ఈ రాజదర్బారునకు సమీపమున గొన్ని భూగృహములు గలవు.

ఈ భూగృహములందు రాజభటులు గూరుచుండి కావలి కాయుచుండెడివారట. ఇట్టివి పెద్దవి రెండును, చిన్నవి కొన్నియు గలవు. ఈ గృహముల మీది భాగము నేల మట్టమునకు సరిగ నుండును. భూమిలో సామాన్య గృహంబు లుండునంతటి యెత్తున నుండును. లోనికి దిగుటకు శిథిలములుగాని సోపానములు గలవు. గృహములు చీకటి మయములు. కాని చెక్కు చెదర లేదు. ఇవి లాహోరునగల రణజిత్తుసింగు కోటలోని విశాల భూగృహములను బోలియున్నవి. ఇటనుండి భటులు రాజదర్బారును రక్షించెడి వారు కాబోలు?

స్నానాల కోనేరునకు వచ్చు కాలువవెంట నొక పెద్ద రాతితొట్టె గలదు. ఇది యించుమించు నిరువదియడుగుల బారు, నాలుగడుగుల వెడల్పు, మూడడుగుల లోతును గలిగియున్నది. ఒకే రాతిలో జెక్కిన తొట్టి యిది. దీని ప్రయోజనమేమో? దీనిలో నశ్వములు నీరు త్రాగుచుండెడివట. కాని అశ్వశాలగాని గజశాలగాని దీనికి సమీపమున లేవు. రాజదర్బారున కరుదెంచెడి సామంత నరపాలుర యశ్వము లిందు నీరు త్రాగుచుండెడివేమో! రాజదర్బారునకు దసరాదిబ్బ కిది సమీపమున నున్నది. దసరాదిబ్బకు

నుత్తరమున కొలదిదూరమున గజశాల గలదు. ఇచ్చోటనే నశ్వశాలయు నుండి యుండునేమో! కాని యది మాకు గన్పింపలేదు.



గజశాల

గజశాల పదునొకండు గోపురములు గలిగి నేటికి జెక్కుజెదరక మనోహరముగ నున్నది. ఒక్కొక యేనుగున కొక్కకగది. బహు విశాలముగ నున్నది. గోపుర మొక గదిగా నున్నది. దీనికి సమీపమున నగర రక్షకుల గృహము లున్నవి.

నగర రక్షకుల గృహము లొకదాని కొకటి యెదురుగ నున్నవి. ఈ గృహములు చాల పెద్దవి. నేటికి నివి చెక్కు చెదరక యున్నవి. ఇందు విరిగిపోయిన విగ్రహము లెన్నియో యున్నవి. వీనికి ముందు విశాలభూభాగ మున్నది. గజ

మహాలునకు బడమరగ వాచ్ టవరు గలదు. ఇది రమారమి ముప్పదియడుగుల యెత్తున నుండును. ముప్పదియడుగులకు మించిన కైవారము కలిగి యుండును. దీనిపైనుండి రక్షక భటులు నగరమును జూచుచు గస్తుతిరిగి యుండెడివారట. ఈ స్తంభమునకు బడమరగ శ్రీకృష్ణరాయని దేవేరుల నివాస మగు కమలమహాలు గలదు.

కమల మహాలు కమలాకారముగ నున్నది. ఇది రెండం తస్తుల కట్టడము. రెండవ యంతస్తున నీరు నించుటకు దగిన వసతు లున్నవి. కొళాయి మూలమున నీరు పైకి బోవుటకు దగిన యేర్పాట్లు గలవు. ఈ కమలమహాలు నేటికిని జెక్కు చెదరక సుందరముగ నున్నది. కొళాయులు మాత్రము జీర్ణ శీర్ణములై పోయినవి. దీనిపై కెక్కి మా విద్యార్థులు కొలది సమయములు రాణివాసము చేసిరి.

విజయనగర సేనానాయకుని గృహాసమీపమున నొక మసీదు గలదు. ఆ మసీదు పూర్వము తిమ్మరుసు మంత్రి యుండు పెద్ద భవనమట. దానిని మహమ్మదీయులు వారి దేవుని మందిరమైన మసీదుగ మార్చిరని చెప్పుదురు. సేనా నాయకుని గృహము శిథిలమైయున్నది. ఇది నేడు రాళ్ళగుట్ట మాత్రమే.

రాజభవనమునకు నైఋతిదిశలో విజయనగర సామ్రాజ్య దండనాయకుని నివాసభవనమునకు వెనుక భాగమున నెత్తైనగోడలు గలవు. పైభాగమంతయు శిథిలమై యున్నది. ఇది విజయనగర నరపాలుర టంకసాల యని చెప్పుదురు. ఇందు హంపీ విజయనగర సామ్రాజ్యమున

జెలామణి యగు నాణెములు తయారగు చుండెడివట. అట మాకొక నాణెమైన దొరకలేదు.

హజారారామాలయము :— దీనిని శ్రీకృష్ణదేవరాయలు కట్టించెనని చెప్పుదురు. ఇక్కడ నద్భుతమగు విషయ మొకటి గలదు. చదరముగ పాతబడియున్న నాలుగు స్తంభములపై నొకేరాతిలో జెక్కిన చదరపు దూలము బిగింపబడి యున్నది. ఎంతరాతి నిట్టిదూలను తయారుచేయుటకు జెక్కిరోకదా! గోడలపై నద్భుతావహమగు శిల్పము గలదు. హంపీలో నెన్నదగిన కట్టడ మియ్యది. దీనిముందు నూరడుగుల వెడల్పు, రెండువందల యడుగుల పొడవుగల యంతఃపుర సౌధము నేలమట్టమై గుట్టవడి యున్నది. ఇచ్చటనే సాముగరిడీలు నేర్చుచోటు గలదు. దీనిని గుమారు రాముని గరిడీసాల యందురు. ఈ గరిడీసాల నేలమట్టముగ నున్నది. చెడిపోక నేటికిని గట్టిగనే యున్నది.

విరూపాక్ష దేవాలయము :— ఇది భూగర్భమందు నిర్మింపబడిన దేవాలయము. భూమిమీదికి గొంత మెత్తు కన్పించును. దేవాలయ మంతయు భూమిలో నున్నది. మెట్లు దిగి లోపలకు ప్రవేశింపవలయును. తుంగభద్రలో నుండి కాలువ యాలయములోనికి నున్నది. ఇది పైకి గన్పింపదు. ఆలయమెల్ల నెప్పుడు నీటిలో మునిగియుండును. గర్భాలయమును ప్రవేశింప మాకు శక్యము కాలేదు. గర్భాలయమునకు ముందున్న మంటపముగూడ నీటిలోనే యుండును. ఆనాడు మరెట్లు దేవాలయములో ప్రవేశించువారో! ఆనీటి

నెట్లు వెలికి బంపువారో! ఆ గుర్తులు కన్పట్టవు. ఆలయ జలములలో జేప లటునిటు పరుగిడుచుండును. ఇందుగల శివ లింగ మెప్పుడు జలమగ్నమై యుండును. అందొక చేపను బట్టి "వేదముల నపహరించిన సోమకాసురుని సంహరించుట కవతరించియున్న మత్స్యావతార మిదిగో" యని రణకిశోర బాబది నాకు జూపెను. అదివిని నరేంద్రుడు నవ్వుచు :—

"వేదము లెట్లు బ్రహ్మముఖ వీధులనుండి హరింపఁగాఁబడున్
పాదలి సోమకాసురుఁడు వచ్చి త్రయిన్ హరియించెనంచు నే
చీదరఁ బొందకుండ చొఱచేఁపను జేసితివే ననున్ — నరే
నీదయమీఁద నా బ్రదుకు నిల్చెనె చెప్పుమ ధూర్త మానవా!"

యని కవిరాజు త్రిపుర నేని రామస్వామిచౌదరిగారి పద్యమును జదివి మమ్ము జకితుల గావించినాడు.

పీదలింగ దేవాలయము:— చూచుటకిది వింతగ నుండును. ఇందలి లింగము చాల పెద్దది. లింగ ప్రమాణముననే దేవాలయ మున్నది. ఈ దేవాలయములోనుండి నీటికాల్వ వేగముగ బ్రవహించుచు వెలికి వచ్చును. లింగముక్రింద నెల్లపుడు నీరుండును. దీని కొక యర్చకుడు గలడు. అతడా యిచ్చినగాని దీనిలోనికి రానీయడు. కాని మా విద్యార్థులొంటరిగానిపై నాంధ్ర పౌరుషమును బ్రదర్శించి యతనా లీయక దేవాలయములో బ్రవేశించిరి. నేటి యాంధ్రుల పౌరుష మిట్లు దుర్వ్యయమగుట తలవంపుగాదా?

ఉగ్రనరసింహ దేవాలయము:— ఈ యాలయము నకు గప్పు లేదు. ఇందలి విగ్రహము చాల పెద్దది. భయంకర ముగ నుండును. హంపీ చరిత్రలో నిది ప్రసిద్ధమైనది. ఉగ్ర



ఉగ్రనరసింహ దేవాలయము

నరసింహుని విగ్రహ మేకశిలామూర్తి. ఈ భయంకర విగ్రహ మూర్తి నాటి యాంధ్రుల పౌరుషమూర్తి యనవచ్చును. కాని యీ విగ్రహము చెడగొట్టబడినది. దీనిని శ్రీకృష్ణ రాయలు చెక్కించిరట. దీనిని గాంచినపుడు పొన్నూరున గల హనుమంతుని విగ్రహము, గరుత్మంతుని విగ్రహము స్మృతిపథమున కెక్కినవి.

శ్రీ కృష్ణదేవాలయము:— ఇది హేమకూటమునుండి కమలాపురమునకు బోవు మార్గముమీాద గలదు. దీని ప్రాంగణము దరిదాపు మూడువందల యడుగుల పొడవు, రెండువందల యడుగుల వెడల్పు గలిగియుండును. దీనిని

శ్రీకృష్ణరాయలు పదునైదవ శతాబ్దమున గట్టించెనని చెప్పుదురు. ఇందలి కృష్ణవిగ్రహము చూడ ముచ్చట గొల్పును. దీనిని గాంచినతోడనే లాహోరునందు గల యనార్కలీ బజారులోని వంశీధర విగ్రహము స్మృతికి వచ్చినది. ఆంధ్రావనిలో కృష్ణమందిరములు లేవనియే చెప్పనగును. దీని సింహద్వార భాగము జీర్ణమైపోయినది. ప్రక్కన గల వాకిలి మూలమున బ్రవేశించి దీనిని జూడ నగును. ఇందు గోపికాకృష్ణ లీలలు బొమ్మలుగా జెక్కబడి నేటికిని జెక్కుచెదరక నిల్చియున్నవి.

విఠలదేవాలయము :—దీని కెదురుగ నొక రాజవీధి గలదు. సుమా రఱమైలు వఱకు రాతిమంటపములు గలవు. ఇటనుండి రెండు ఫర్లాంగులు పోయిన నానెగొందికి బోవు మార్గము తగులును. కుడివైపునకు బోయిన కమలాపురము నకును, నెడమవైపునకు బోయిన దుంగభద్రానదికిని బోవ నగును. ఇట బుట్లలో దుంగభద్రను దాటి యానెగొందికి బోయెదరు. ఆనెగొందినుండి ముందు ద్వారము దాటినచో, ద్వారమునకు నెడమప్రక్కన రంగనాథ దేవాలయము గలదు. దానికి ముందు గొంతదవ్వేగిన బంపాసరోవరము వచ్చును. పంపను కన్నడమున హంపి యందురు. ఈ సరోవరమునకు గుడి యెడమ భాగములలో జిన్ని కొండల బారు గలదు. ఎడమప్రక్కకుబోయి కోటగోడలు దాటిన నంజన పర్వతము కన్పించును. దాని కెదురుగ గన్పట్టుబాటను వీడి యెడమ దెసగా గొంతదూరమేగిన నఱమైలులో నొక నీటి కాల్వ కన్పట్టును. ఆకాల్వపై నారేడడుగుల యెత్తున రాతి

గచ్చుతో నిర్మించిన యొక కాల్వ గలదు. దానిలో నీరు మహావేగముగ ప్రవహించును. ఆ కాల్వను దాటినచో బవిత్రము ప్రసిద్ధము నగు పంపాసరోవరము వచ్చును. దీనికి వెనుక భాగమున నొక దేవాలయము గలదు. దానిని శబర్యాశ్రమ మందురు. ఇట శ్రీరామచంద్రుడు శబరి యాతిథ్యముగ్రహించెనందురు. రామాయణకథ సమగ్రముగ నెఱుగని మా విద్యార్థుల కదియంతయు నగమ్యగోచరముగ నున్నదనుకొందును. ఈ విజయవిఠలుని దేవాలయము హంపీలో జాల ప్రసిద్ధిగన్నది. శ్రీకృష్ణదేవరాయలు దీనిని హజారి రామాలయమును 1513 వ సంవత్సరమున ప్రారంభించి 1564 వ సంవత్సరములో ముగించెనట. ఈ విఠలాలయ శిల్ప మపూర్వము. అనన్య శిల్పి జనదుర్లభము. ఈ దేవాలయముయొక్క విశాల మంటపమున పెద్ద స్తంభములు, దానిచుట్టు నేడు చిన్న స్తంభములు కొంచె మెడముగ నున్నవి. ఈ చిన్న కంబములపై గొట్టిన వరుసగ నారోహణావరోహణ క్రమమున సప్తస్వరములు పలికి యొడలు పులకింపజేయును. మార్గశ్రాంతులైయున్న మా విద్యార్థులా కంబములనుగొట్టి తట్టి వానినుండి వినవచ్చు స్వరమాధుర్యమునకు ముగ్ధులై కొంతతడ వటనే హాయిగ విశ్రాంతి బొందిరి.

"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగాన రసంఫణిః"

యని చెప్పిన పెద్దలవచన మట ఋజువైనది. శ్రీకృష్ణరాయలు కవితాకళతోపాటు శిల్పకళను, సంగీతకళను, మూర్తికళను, వాస్తుకళను నెంతగ బోషించినాడో ప్రావడ్డ

హంపీశిథిలములను వీక్షించిన మాత్రమున బోధపడును. ఈ యాలయ ప్రాంగణమునగల రాతిరథము చూడ చోద్యముగ నుండును.

రాతిరథము శిల్పనైపుణికి గీటురాయివలె గన్పట్టును. దీనిని జూడని కనులు కనులుకావు. మానవేంద్రాదులు చంగున దీనిపైకి నెక్కి మాజట్టునాయకుని యాగ్రహము నకు బాత్రులయిరి. విశాలాలయావరణమున శ్రీ కొడాలి మోహనరావు మాఫొటోతీసి తనకుగల ఛాయాగ్రహణ పాటవమును వెల్లడించుకొన్నాడు.

రాజతులాభారము :— నేటికి నిది చెడకుండగనే యున్నది. అటునిటు రాతికంబములు. పైభాగమున రాతి దూలము కలదు. దానిని దొలిచి యినుపకొండీ లమర్చిరి. శ్రీకృష్ణరాయలు తనయెత్తు ద్రవ్యమును దూచి తన రాజ్యమున గల బీదలకు బంచియిచ్చెడివాడట. సర్వప్రజాలోకమున బీదలసేమము నరయుటయే లెస్స. అట్టివాడే ప్రభువు.

ఆనెగొందికిని హంపీవిజయనగరమునకును నడుమ దుంగభద్రానది ప్రవహించును. శ్రీకృష్ణదేవరాయలు దానిని దాటుటకు రాతిసేతువును నిర్మింపజేసెనందురు. ఇది నేటికిని తుంగభద్రానదిలో గలదు. కాని పైభాగమంతయు నదిలో బడిపోయినది. ఇపుడు దీనిపై నదిని దాటుటకు వీలులేదు.

వరాహదేవాలయము:— ఇది తుంగభద్రా నదీతీరమున నున్నది. ఇందు వరాహచిత్రములను జూడవచ్చును.

కోదండరామ దేవాలయము:— ఇందు శ్రీరామ చంద్రుని విగ్రహము గలదు. ఈ విగ్రహము కోదండ మెక్కు పెట్టినట్లుగా నుండును. ఇది చూచుటకు మనోహరముగ నుండును. ఇట గల తుంగభద్రనే చక్రతీర్థ మందురు.

అచ్యుతరాయల దేవాలయము:— అచ్యుతరాయలు దీనిని 1599 వ సంవత్సరమున గట్టించెను. దీని కుడ్యభాగ ములపై జీనా దేశపు వర్తకుల చిత్రము లున్నవి. అవి నేడు శిథిలములై యున్నవి. నానావిధ మృగచిత్రము లిందు చిత్రితములై యున్నవి. వేశ్యలబజారని చెప్పబడు విశాల మగు హంపీబజారు కొనలో నీయాలయ మున్నది. దీనికి సమీపమున బెద్ద నందివిగ్రహము గలదు. దీనిని కన్నడులు బసవణ మందురు. ఈ విశాలవీధి కిరువైపుల ప్రాంశువులైన సాలవృక్షము లుండెడి వందురు. ధనికుల ప్రాసాదములు నీ వీధియందే నుండెడివట.

మాతంగఋషిపర్వతము:— ఈ పర్వతము నెక్కుటకు మెట్లు గలవు. అచ్యుతరాయల దేవాలయమునకు బడ మరదిక్కుగా నీకొండపై దేవాలయములు కొన్ని ప్రావడి యున్నవి. ఈ కొండనెక్కి చూచినచో విజయనగరము యొక్క మనోహర దృశ్యము లన్నియు గోచరించును.

విరూపాక్ష దేవాలయము:— దీనిని బంపాపతి దేవా లయమనియు నందురు. విరూపాక్షేశ్వరుడు విజయనగర సామ్రాజ్యాధిదేవతయని చెప్పుదురు. ఈ దేవాలయపు సింహ ద్వారమున బెద్ద గాలిగోపురము కలదు. దీనియెత్తు రమా

రమి నూటయరువదియైదడుగు లుండును. పైకెక్కుటకు మెట్లున్నవి. దీనిచుట్టును రెండు ప్రాకారములు గలవు. ప్రాకారము పొడవు రెండువందల యెనిమి దడుగులు. నూట ముప్పదినాలు గడుగుల వైశాల్యము కలిగి యున్నది. దేవాలయ మధ్యభాగమున దుంగభద్రనుండి ప్రవహించు నీటి కాలువ గలదు. ఆ కాలమున వేయబడిన రంగులు నేటికిని జెఱగిపోక రంగమంటపమున గలవు. విద్యారణ్యస్వామివారి యుకుపుల గది యొకటి కలదు. ఈ ప్రాకారమున శ్రీభువనేశ్వరీ దేవ్యాలయముకూడ గలదు. గురుగింజ మాధవస్వామి దేవాలయ మొకటి కలదు. దీనికి వెనుకభాగమున శ్రీవిద్యారణ్యస్వామివారు తపమాచరించిన చోటును, స్నానమాడిన తావును గలవు. విరూపాక్షేశ్వరునకు నిత్యపూజలు జరుపుట కీనాములు కలవు. దేవాలయమునకు నుత్తర దిక్కున ద్వారమున్నది. ఈ ద్వారమున గనకేరినాయకుని పేరుగల గోపుర మున్నది. పై దేవాలయమున కెదురుగ విశాలమైన వీధి యున్నది. దీని కిరుపార్శ్వముల రెండంతస్థుల శిలామండపములు శిథిలమై యున్నవి. ఇందు గొన్ని యంగళ్ళు గలవు. ఉకు కట్టతో నిర్మితమైన యెత్తైన రెండరదములు గలవు. చైత్రశుద్ధ పూర్ణిమనాడు రథోత్సవము జరుగునట. దీని కెదురుగ బెద్ద నందివిగ్రహ మున్నది. దేవాలయ ప్రాంగణమున గోతులు హెచ్చుగ నున్నవి. వానితో మా విద్యార్థులు చాలతడ వాడిరి. సజాతీయులకు స్నేహము పొసగునుగదా!

టంకశాలను జూచి తిరిగి వచ్చునపుడు మా కొక కట్టడముపై నల్లత్రాచుబా మొకటి కన్పించినది. ఆంధ్ర

పౌరుషము కదనమాడిన వీరభూమి యానాడు. క్రూరజాతికి శిథిలమైనట్లు నేడును క్రూరజాతికి నిలయమై యున్నదని యొక యుడుకుపొంగు లోనుండి వెలికి వచ్చినది. ఆ క్రూర సర్పము మాజట్టు బుడుతల దాడికి నుడుతమై యుక్కిరి బిక్కిరియై యెటుపోవుటకును దారితోపక యించుక యట నిలబడి మావంక జూచి చెట్టు తొఱ్ఱలోనికి జిత్తగించినది. క్రూరుడు పౌరుషశాలిని జూచిన నేమిచేయును? ఆ పెను గోట గోడలలో నాంధ్రపౌరుషము దీర్ఘనిద్రలుపోయినను నది యటకేగినవారిని మేల్కొల్పును గాబోలు. మా కుఱ్ఱలు తొఱ్ఱలో దూరిన పాపజాతి జోలికి బోవుట కుత్సహించిరి. మా మందలింపులతో వెనుదిరిగిరి.

మా నరేంద్రుని యంజలిలో నొక పెద్ద కుళీర మున్నది. అది శ్రీ విరూపాక్ష జటాజూటముపై బ్రవహించు తుంగభద్రా జలములలో దనకు బట్టువడినదట. దానిని విడువక చాలదవ్వు కొనివచ్చెను. ఆ మమకారము విరూపాక్షుని మీదిదో హంపీక్షేత్రము మీదిదో తన బాల్యక్రీడ మీందిదో జంతు ప్రకృతి పరీక్షాకేళి మీదిదో దానిని దాని కనువైన యొకచోట నతడే బుద్ధిపుట్టి విడిచినాడు. "ఆత్మవత్సర్వభూతాని" యన్నారుగదా పెద్దలు.

అనంతశయన దేవాలయము :—ఇది హాస్పేటకు మైలుదూరమున నున్నది. ఒక పీఠ మిందు గన్పట్టును. అది కడు పొడవు, కడు నెత్తు కలిగి యున్నది. శేషశాయి యగు విష్ణువిగ్రహ మిందుంచుట కిది నిర్మింపబడె నందురు. ప్రస్తుత మా విగ్రహము బళ్ళారి జిల్లాలోని హడగల్లి తాలూకా

లోని హేలాలు గ్రామమున నున్నదట. దీని గోపురనిర్మాణ మానాటి వాస్తుశాస్త్రజ్ఞుల ప్రజ్ఞను వెల్లడించును. దూలములు లేకయే నిలువంపుగా గోపురముయొక్క కప్పు నిర్మింపబడియున్నది. అట్లు నిలబడుట యొకవింత.

చూళాయి బావి:— దీని నొక వేశ్య త్రవ్వించినదట. ఇది హంపీకి హాస్పేటకు మధ్యనున్నది. ఇది దిగుడుబావి. ప్రస్తుతము ప్రజలకుపయోగించుటలేదు. ఇది కాశిలో గల మణికర్ణికా ఘట్టమున నున్న మణికర్ణికను బోలియుండును. అందలి నీరములు స్నానమునకు నిందలి జలములు పానమునకు నుపయోగింపకున్నవి.

మహమ్మదీయుల గోరీలు:— గొప్ప గోరీలు రెండు హంపీకి జెంగటగా నున్నవి. ముఖద్వారములు నలుప్రక్కల నున్నవి. మత్స్యాకారమున వెలయుచున్నవి. ఒకటి చిన్నది. మఱియొకటి పెద్దది. ఇవి మహమ్మదీయుల గోరీలందురు. వానిపై నూరుపేరులు లేవు.

సెనగగింజ గణపతి:—ఇందలి సభామంటప మందమైనది. దీని నిర్మాణము రోముపట్టణములోని కట్టడమును బోలియుండునట. ఇందు గణపతిమూర్తి చాల పెద్దది; సుందరమైనది. కాని నేడు ఛిన్నభిన్నమై యున్నది.

వ్యాసరాయల మఠము:— ఇది వరాహదేవాలయమునకు గుడిప్రక్కననున్న చిన్న కొండపై నున్నది. ఇది జైనదేవాలయమందురు. కోటయొక్క రెండు ప్రాకారముల ద్వారముల కెదురుగా మాసటిరాయి యున్నది.

సుగ్రీవుని గవి:— వ్యాసరాయల మఠమునుండి సుగ్రీవుని గవివఱకు నొక తెల్లని రాతిచీలిక వెడలియున్నది. దీనిని సీతకోక చెఱఁగందురు. సీత నిజాభరణముల నిటనే తొల్లి పడవైచినదట. ఈ గుహావద్ద నొక సరోవర మున్నది. దీనిని సీతాసరోవర మందురు. ఇందు సుస్నాతులైన సతులకు దీర్ఘమాంగళ్యమబ్బునని యందురు.

రఘునందన తీర్థ బృందావనము:— సుగ్రీవుని గుహనుండి తుంగభద్రానది వెంట నడచినచో నెడమప్రక్కన ఫర్లాంగుదూరమున నుత్తరాదిమఠాధీశులైన శ్రీరఘునందనుల వారి తీర్థ బృందావనము కన్పట్టును.

నవబృందావనములు:— ఆనెగొందికి సుమారు ౨౨ మైలు దూరమున దుంగభద్ర రెండుపాయలైన తావున నాపాయలకు నడుమగ నవబృందావనము లున్నవి. ఇవి మధ్వులకు బుణ్యస్థలములు.

**వాలిచితి:—** ఆనెగొందినుండి కమలాపురమునకు వెడలు మార్గమునకు నుత్తరమున నున్న తలారిగట్టునుండి నదీతీరము వెంట రెండు మైళ్ళరిగినయెడల నొకదిబ్బ కన్పట్టును. అది వరిమళ్ళ నడుమ నున్నది. ఆ దిబ్బచుట్టు సాల వృక్షము లున్నవి. ఆ ప్రాంతమునెల్ల నింబాపురమని పిల్తురు. ఆ దిబ్బనే వాలికాష్ఠ మందురు. దిబ్బ త్రవ్వినఁ నెముకల చిట్టలు కన్పట్టును. శ్రీరామచంద్రు డటనే సప్తతాళ భంజన మాచరించెనట. నది కావల జింతామణ్యాశ్రమ

మున్నది. అట నొక గండశిల కలదు. దాని నెక్కియే శ్రీరామచంద్రుడు వాలిని వధించెనట.

ఉద్దామ వీరభద్రుని దేవాలయము:— కమలాపుర మార్గమునకు వామపార్శ్వమున నీ దేవాలయ మున్నది. ఇందలి విగ్రహము మిక్కిలి యెత్తున నామమునకు దగినరీతి నున్నది.

అక్కచెల్లెండ్ర రాతిగుండ్లు:— ఇవి రెండు మార్గ మధ్యమున నిలిచియుండి ద్వారమువలె గన్పించును. వీని క్రింద విశేషధనము గుప్తమై యున్నదందురు.

హంపీవిజయనగర శిధిలములను గనులార గాంచి యరివీర భయంకరులైన నాటి తెలుగువీరుల యవక్రపరాక్రమమున కచ్చెరువడి వారికిగల కళాపోషక హృదయమున వింతపడి యభివందనములను దెలిపితిమి. రామరాజ భూషణుడు, పెద్దనామాత్యుడు, ముక్కు తిమ్మన, తెనాలి రామకృష్ణుడు, ధూర్జటి విహరించిన రాజవీధుల వెంట దిరుగాడి సంతసించితిమి. రాయలు కొలువుదీరిన రాజదర్బారు దిబ్బపై మా విద్యార్థు లెక్కి కొంతతడవు రాయ లొకడు, తిమ్మరుసు మఱొకడు, దండనాయకుడు వేఱొకడు మిగిలిన వారు సామంత నరపాలురునై వ్యవహరించి మాకు ముచ్చట గూర్చిరి. పిదప వారు దసరా దిబ్బపై గవితాకళ దర్బారుచేసి నాటి యష్టదిగ్గజములు పొందని యానందమును బొందిరి. నాడు మా జట్టునకు గలిగిన యానందము వర్ణనాతీతము. విజయనగరాధీశుల హృదయనైర్మల్యమును దుంగభద్రా

జలములు నేటికిని జాటుచునే యున్నవి. అందలి పవిత్ర శీతల మధుర జలములను గ్రోలి యాం తుంగా తరంగ రింగణ ములు చెంగలించు తీరమున గొంత తడవు విశ్రమించితిమి. మా జట్టులోని పిన్నవారు కోతులతో గాలము వుచ్చిరి.

హంపీశిథిలములలో నుడుము లధికము. తొండల వలె హెచ్చుగ గన్పించును. క్రోతులు, కొండముచ్చులు పెచ్చుపెరిగి యున్నవి. యాత్రికులను వెంబడించి క్రోతులు చేతులు చాపును. పెట్టినదానిని సహర్షముగ స్వీకరించి గంతులిడుచు సంతోషాతిరేకమున భుజించును. హంపీ శిథిల ములలో నేడు వానరతండములే సజీవ మానవప్రకృతులు.

శ్రీకృష్ణరాయాది సమ్రాట్టులు వీరవిహార మొన రించినట్టి హంపీనగర రాజవీధులందు వారి నివాసభూముల యందు నే డిక్షువనములు దట్టముగ బెరిగియున్నవి. శాలి క్షేత్రములుగ గొన్ని మాఱియున్నవి. ఎటు చూచినను మహావేగముగ బ్రవహించు కాల్వ లటగాన్పించును. హంపీ విజయనగర రాజవీధి విశాలముగ నున్నది. వీధి నానుకొని యున్న శిలాభవనము లన్నియు బ్రావడి నిర్జనములై శోభా విహీనములై కనప్పట్టును. అటనట గొండఱు కన్పింతురు. వారి మొగములలో గళాకాంతు లుండవు.

మా జట్టువా రటనున్న కాఫీహోటలునకు గొంద ఱేగిరి. కొండఱు నారికేడములను బగులగొట్టి దంతములకు బనిచెప్పిరి. నరేంద్ర ప్రభృతులు సెనగపప్పులు కొని వెద జల్లి కోతులకు బనిచెప్పిరి. ఇంతలో సూర్యభగవానుడు బాల్య యూవన కౌమారదశలు గడచి జరఠదశలో ప్రవే

శించి పంచమదశ బొందనుండెను. అవును హంపీ సామ్రా జ్యాధినేతలగు రాయలవంశీయుల యస్తమితప్రాభవ విశేష ములను మాయెదుట దాను గనుగొనలేక మేమును గను గొనుట దనకిష్టములేక యస్తమించుట కుపక్రమించి యుండును. హంపీశిథిలములు వీడిపోవ మా కుత్సాహము గలుగదయ్యెను. అయినను దప్పునా? క్రమ్మఱ గృహ ప్రయాణుల మైతిమి.

బస్సు వచ్చినది. అది మాల్యవంతము దిగలేక యట నాగి కేక వేయ దొడగినది. మేమెల్లర మటకు బయనమైతిమి. మానడక శిథిల రాజప్రాసాద దేవాలయప్రాంగణజనిత సస్యముల మీదుగా నుండెను. ఆ దృశ్యము విషాదరేఖలను రేపినను రాజ్యలక్ష్మి సస్యశ్యామల లక్ష్మిగా మాఱి మా కొక్కింత యానందమునే కూర్చిన దనవచ్చును. బస్సునకు బోవు త్రోవలో నొక తింత్రిణి చింతకాయలను వ్రీలగాచి యుండెను. లీలా వేంకటరత్నము, వేంకటసుబ్బయ్య, వేంక టేశ్వరరావు, శ్రీరామమూర్తి, కిశోర, నరేంద్ర ప్రభృతులు దానిపై దాడిసల్పిరి. వారిని గదుముచు నది మంచిపని కాద నుచు బెద్దలమైన మేమును దానిపై కెగబడితిమి. నాకు బులుపు రుచింపదు లెండు. అయినను నన్నువిడనాడి వ్రాసి నచో నేను బెద్దలలో లెక్కకురానేమొ. అప్పటి మానీతి కోడలికి బుద్ధిసెప్పి తెడ్డునాకిన యత్తగారికివలె నున్నది. ఇట్టి నీతులవలననే విద్యార్థులయెడ మన యుపదేశములు నేడు నిరర్థకము లగుచున్న వనుకొంటిని. పిమ్మట విసవిస నడచి బస్సును జేరుకొని యందు గూరుచుంటిమి. శరవేగమున

బండి పయనమై నడచుచున్నది. కాని మా హృదయములు, "చీనాంశుకమివకేతోః ప్రతివాతం నీయమానస్య" అన్న మహాకవి కాళిదాసుని వచనానుసారము హంపీవైపునకు జూచు చుండెను. శరీరములు మాత్రము ముందునకు బోయినవి.

# ఏడవ మజిలీ

## మైసూరు మండలము

మేము క్రమ్మఱ హాసుపేట జేరితిమి. హుబ్లీనుండి బండి వచ్చినది. విద్యార్థులు సామానులు బండిలో నుంచిరి. రెండుమూడు పెట్టెలలో మే మందఱ మెక్కి కూరుచుంటిమి. విద్యార్థులను లెక్క చూచుకొంటిమి. అందఱును బండిలోని కెక్కిరి. మా జట్టుయొక్క జయజయ ధ్వానములతో బండి కదిలినది. బళ్ళారి కంటోన్మెంటు స్టేషనునకు వచ్చితిమి.

బళ్ళారి మిశ్రాగారి మధ్యవర్తిత్వమున మైసూరు ప్రభుత్వములోనికి బోయిన యాంధ్ర నగరమని విద్యార్థు లెఱిగిరి. బళ్ళారి చూచుట కందమైనది. ఇట శ్రీకృష్ణ రాయలనాటి సైనిక దుర్గము గలదు. పూర్వాంధ్ర కర్ణాట రాజధానియగు జీర్ణ విజయనగరపు బాటిదిబ్బ యొకటి యిట గలదు. ఈబళ్ళారిజిల్లాలో రాయదుర్గ మాదోనిదుర్గము, కొత్తూరు, సామేహల్లీ, యాలూరు ననునవి ముఖ్యములు. దీనిని రాయలసీమ యనియు నందురు. బళ్ళారినుండి వీరాపురను స్టేషను జేరితిమి.

పీరాపూరులో నొక యీరాని కుటుంబము తమ సామానును మా పెట్టెలో వేయసాగెను. మా పెట్టె వారి సామానులతో నిండిపోయెను. ఇంకను సామానులు వేయుట మానలేదు. ఒక యీరాను యువతి సామాను లందుకొను చుండెను. మాలో నొక రాగ్రహావేశ పరవశులై సామానును గ్రింద బడవైచిరి. అంతట వారు మఱొక పెట్టె చూచు కొనిరి. ఈరానిజాతి కత్తు లమ్ముకొను జాతియట. వారనిన మనవారు భయపడుదురట. కాని యొక యీరానికాంతను గద్దించి మఱొక పెట్టెలోని కెక్కించిన ఘన విజయమును మా జట్టువారు సాధించిరి. ఇది ఘనవిజయమో దానిని దల దన్నిన యపజయమో నేను నుడువను.

గుంటకల్లు సాయంసమయమునకు జేరితిమి. అట బండి యాగినది. క్రమ్మఱ బయలుదేరుటకు దడవు పెద్దగ నున్నది. పలుపెట్టెలలో జీలియున్న మాజట్టు క్రమ్మఱ నేకత్ర మిళితమైనది. విద్యార్థులకు భోజనవసతి కల్పింపబడి నది. కొందఱు బిందెలతో నీళ్ళు తెచ్చిరి. తృప్తిగ భుజించి హాయిగ జట్టు నిద్రించినది. పిమ్మట బండి యంధకారమున బెంగుళూరునకు బయనమైనది.

అనంతపూరు చేరితిమి. ఇచట నధికసంఖ్యలో రైలు నెక్కుదురు. స్టేషను చూచుట కందముగ నుండును. ఇది యాంధ్ర అసెంబ్లీ ఉపప్రధానియగు శ్రీ నీలం సంజీవరెడ్డిగారి జన్మస్థలమగు పల్లెటగ్రామ మిందుగలదు. అసెంబ్లీలో బ్రతిపక్షనాయకుడు శ్రీ తరిమెల నాగిరెడ్డిగారు జన్మించిన

పల్లెగ్రామ మీ జిల్లాలోనే యలరుచున్నది. ధర్మవరము, హిందూపురము స్టేషనులు సుందరముగ నున్నవి.

అనంతరము బెంగుళూరు స్టేషనునకు జేరుకొంటిమి. ఇది పూర్వము వీరబల్లాల నృపతి పరిపాలనమున నుండెడిదట. ఆ రాజవరుడు మృగయావినోదార్థము వెడలి క్షుత్పిపాసలకు గొట్టువడి యొక పేదరాలి గీమునకు జేరెనట. ఆవృద్ధురాలు పచ్చిబటాణీ యుడికించి యానృపతి కాతిథ్యమిడెనట. బటాణీలను గన్నడమున "బెంగల్" అందురు. ఆ రాజట జిన్నిపల్లె నిర్మింపగా నది బెంగుళూరైనదట. ఇట 1537 వ సంవత్సరమున గెంప గౌడరాజు కట్టించిన మట్టికోట యున్నది. దానికి బదులు హైదరాలీ 1761 వ సంవత్సరమున ఫ్రెంచి యింజనీర్లచే రాతికోటను గట్టించెను. మఱియు నీపట్టణమున సిల్కు, సిమెంటు, కాగితములు, వస్త్రము, లగ్గిపెట్టె, లినుము, టెలిఫోను-విమానభాగములు మున్నగు వాని నుత్పత్తిజేయు నాధునిక కర్మాగారములును గలవు.

బెంగుళూరునుండి రైలుపోవునపు డినుపదాటికి సమీపమున నిండ్లు యమకూపములవలె గన్పట్టినవి. అవి మానవ నివాసయోగ్యములుగ లేవు. ఆయిండ్లవరుసలు కుక్కపిల్లల వలె నొకదానిపై నొకటియెక్కి కశ్మలభూయిష్ఠమైన వీధులతో నిండియుండెను. బహుశః ఆయిండ్లు మరుభూములను సస్యశ్యామలములుగ నందనోద్యానములుగ దయారుచేసి నగరవాసులకు నుత్తుంగోత్తుంగ రమ్యహర్మ్యములను నిర్మించి యిచ్చిన పారిశ్రామికులవై యుండునని తోచెడిని. కార్మికులన "దమకార్యంబు పరిత్యజించి పరార్థప్రాపకులై" వెలయు

సజ్జనులు కాబోలు. తా మా మురికిగుంటలయందే తృప్తి వహించుచుండి రనవచ్చును. అట్టివారిని "మీరు సజ్జనులరు" అని బిరుదావళి పఠించి యున్నకడనే యుంచుటో, లేక స్వాములకు దయగలిగి యాచరణస్థితికిదిగి వారి కాయము కూపములనుండి మోక్షము గలిగించుటో నేటికిని నా సమస్యకు బరిష్కారస్థితిపట్టలేదు. ఎండకునివాసములై, వానకావాసములై, చలి కధివాసములగుచు వారి పూరిగుడిసె లుండును. ఈ శ్రామికులే యథార్థముగ శీతవాతాతపముల కోర్చి శ్రమించు శ్రామిక తాపసు లగుదురు. ఇంత యేల? బెంగుళూ రందమైన పట్టణమగును. వీధులు సుమనోహరముగ నుండును. పార్కు లాకర్షవంతములుగ నుండును. ఇది మైసూరు ప్రాంతమునకు రాజధానీ నగరము. శాసన నిర్మాణ సభాభవన మిందు గలదు. అంగప్రాంతములో దుష్టాంగమువోలె నీ మురికికూప మేమిటి? భవ్యభవనముల గట్టి విశాలవీధుల నేర్పరించి, సుందరోద్యానముల నిర్మించి శ్రమించి మించిన శ్రామికుల కీ మహానగరములో నీ గతి యేమిటి? శ్రమవారిలోని హాయి నెఱుగని భోగులకు భవ్య భవనము లిచ్చి జాలఱిగించి శ్రమించి చెమటూడ్చు త్యాగుల కెండిన తరుల నీడలనేని నొసగని భగవానుని విషమబుద్ధికి దహాతహా పడితిని. భగవానుడు జగద్భర్త. అయినను నతడు మానవులకు స్వాతంత్ర్య మొసగియుండె నట. ఆ స్వాతంత్ర్యమును దుర్వినియోగ పఱచెడి శక్తి మానవుల కున్నదని చూపుటకు ప్రపంచములోని పెక్కు నిదర్శనములలో నిది యొకటై యుండవచ్చును. నే నిట్లను కొనుచుండ రైలు శ్రీరంగపట్టణము చేరినది.

వేళ యతిక్రమించుటచే నాకలికి నకనకలాడి పోవు చుంటిమి. మైసూరు స్టేషను సమీపించు టెపుడాయని యాలోచించుచుండగనే బండి మైసూరునకు జేరినది.

మాజట్టులోనివా రెల్లరు తలకొక వస్తువు పుచ్చుకొని స్టేషను వెలికి వచ్చిరి. స్టేషను చాల యందముగ నున్నది. విశాలముగ నున్నది. రైల్వేఆఫీసు మొదలైనవి మిక్కిలి సుందరముగ నున్నవి. అటనుండి సమీపమున గల భోజన వసతి గృహమునకు బోయితిమి. మాలో నెవరు స్నాన మాడలేదు. రైలుమసితో దలలు, నొడలు నిండియున్నవి స్నానవసతిలేమి నట గాలుసేతులు మాత్రము పరిశుభ్రము లొనర్చుకొని భోజనమునకై పై యంతస్తున కేగితిమి. ఎదు రుగనున్న పెద్ద యద్దములు వికారముగనున్న మా యాకార ములను దమ గర్భములందు జూపినవి. సజ్జనులు పరహితరతి మతితో బరుల తప్పుల నెత్తిజూపుట నైజమే గదా ? మా యాకృతులకు మేము లోలోన సిగ్గిల్లి చీదరించుకొంటిమిగాని యద్దములపై గినుక వహింపలేదు. అట నుప్పు కారము లేని మెతుకు లంకలికోర్వ లేక చప్పరించితిమి. అక్కడ సమ్మానం దాభ్ధిలో ముంచుట కెన్నో సాధనసామగ్రు లున్నవి. గగన చుంబియగు సుందర ప్రాసాదము, అందులో స్ప్రింగుకుర్చీలు, నిలువుటద్దములు, గాజుగ్లాసులు, అవి మాకేమియు రుచింప లేదు. కడచిన సాయంసమయమున గుంటకల్లు రైలులో దిన్న యల్లపు పచ్చడి నేతిమెతుకులు తలపునకు వచ్చి నోరూరినది. ఇట నిమ్మకాయ పచ్చడి వడ్డించిరి. అది కాలకూట విషము. దక్షిణాపథమున నాంధ్రేతరు లెల్లరు

దీనిని భుజింతురట. కాని మాకప్పుడు దేవాసురులు సము ద్రము త్రచ్చినపుడు పుట్టిన కాలకూటమును శివుడు మ్రింగిన పౌరాణికగాథ జ్ఞప్తికివచ్చి యట్టి శివదేవుడును నీనిమ్మకాయ పచ్చడి చవి చూడలేడనుకొంటిమి. నాటికి చప్పిడి మెతు కులు చప్పరించి లేచితిమి. ఇండ్ల సద్దికిచ్చువారు మమ్ము ముట్టడించిరి. నా చదువుకొనురోజులలో గాశీ పట్టణమున కేగినపు డటగల పండాలు ముట్టడించు ముట్టడి తలపునకు వచ్చినది. అటనుండి మేము నెత్తిపై సామాను లిడుకొని "లోకసేవానిరత బిరుదాంకితు"లగు అంబుల అన్నయ్య పండితుని సత్రమున కేగితిమి.

పండితుని సత్రము రెండతస్తుల మేడ. చక్కని వసతి గల భవనము. స్టేషను మైలున్నరలో గలదు. బండికిరాయి యాఅణాలు. దీనిముందు విశాలమైన వీధియున్నది. ఆకా శమునంటి శీతలచ్ఛాయ లొసగు నిద్రగన్నేరు చెట్టు లిట గలవు. మైసూరులో గల పెద్ద మార్కెట్టు దానికించుమిం చొక మైలులో నున్నది. పై యంతస్తులో నొకగది యద్దెకు బుచ్చుకొంటిమి. సేనానివహాము వోలె మేమక్కడ విడిసి తిమి. వంటకు వేరుగ క్రిందిభాగమున గదులు గలవు. అన్ని సౌకర్యములు గల సత్రమిది. కొంచెమాగి మా జట్టులోని వారల మెల్లరము గజస్నానమటగల నూతికడ జేసితిమి. చిటికలో మా రఘురామయ్యగారు వంట చక్కబెట్టిరి. నేను మా రఘురామయ్యగారు నిల్లు కనిపెట్టుకొని యుండ మా జట్టు రాజప్రాసాద దర్శనార్థ మరిగినది. అనంతరము మేమును జూచితిమి.

మైసూరును మహిషమండల మందురు. తొల్లి యీ ప్రాంతమున కధిపతి మహిషాసురుడట. అతనిని గాళికా దేవి సంహరించినది. ఆమెకు మహిషాసురమర్దని యనుపేరు గలదు. చెంగటనున్న కొండపై జాముండీశ్వరి యను పేరితో నామె వెలయుచున్నది. మఱికొందఱు మహిషాసురులిట నివసించుటం బట్టి యీ పేరు వచ్చిన దందురు.

మైసూరు నిమ్నోన్నత శిలాభూభాగముపై గట్టబడి యున్నది. వీధు లన్నియు దరిదాపు నిమ్నోన్నతములుగా నుండును. కాని విశాలము లైనవి. మురికి యన్నది కాన్పింపదు. అన్నియు దివ్య భవనములు. మురికి పేటలు కంటికి గన్పింపలేదు. నగర మధ్యమున నటనట విశాల క్రీడా స్థలము లున్నవి. సాయం సమయమున బాలబాలికలు క్రీడావ్యాసంగమున వచ్చి యట గాలము పుత్తురు. అటగల వారి వేషము లాంధ్రుల వేషమును బోలియుండును. భాషా బాహ్యస్వరూప మాంధ్రభాషా లిపినే పోలియుండును. పదములలో గూడ జాల పోలిక కన్పట్టును. మైసూరు మహారాజు శైవుడు. అచటి ప్రజలుకూడ హెచ్చుమంది శైవులే. స్త్రీ పురుషు లెల్లరు లలాటమున త్రిపుండ్రములు ధరింతురు. కాని వారి యాకృతులంత యాకర్షణీయములుగ నుండవు.

మైసూరులో "జగన్మోహన పాలెస్" చూడదగినది. దాని నానుకొని మహారాజుగారి సినిమాహాలు కలదు. **మహారాజుగారు** కుటుంబ సమేతముగా నటకు వచ్చి సినిమా

చూతురట. జగన్మోహన పాలెసులో మైసూరు మహారాజుల చిత్రములు, వారి మంత్రుల చిత్రములు నున్నవి. భారతవర్ష మున ప్రసిద్ధివహించిన చిత్రకారుల శిల్పము లన్నియు నట



జగన్మోహన పాలెస్

గలవు. మా జట్టువార మవి చూచుట కందు టికెట్టుకొని ప్రవేశించితిమి. అందు యస్. యల్. హాల్డన్కర్ వ్రాసిన ఆశాజ్యోతి (Light of hope)యను చిత్రము సజీవముగ నున్నది. అది యొక తరుణిచేతిలో జ్యోతి వెలుగుచున్నట్లు కన్పించును. దానిని జూచి మా నరేంద్రబాబు గంతులు వైచినాడు. "ఇంత మనోహరమైన చిత్ర మిదివరలో నెచ్చట లేదు నాన్న!" యని తన యభిప్రాయమును వెల్లడించినాడు.

తరువాత "మలబారు రమణీచిత్రము" స్వభావసిద్ధ ముగ నుండి చూడ ముచ్చట గొల్పినది. రవివర్మ చిత్రము

ఒలో "పసిపాపకు పాలిచ్చు తల్లి" చిత్రము ప్రతిమనుజు నాకర్షించును. దీనిని గాంచినంతన మా యంతేవాసుల కుగ్గుబాలనాటి తల్లి తమ బాల్యచేష్టలు స్మృతికి దగిలి కాబోలు సజీవ ప్రతిమలవోలె చేష్టలు దక్కి యొకింత తడవు దాని గాంచుచు నిలబడిరి. కరిఘటా చిత్రమును జూచుటకు రెండు కన్నులు చాలవు. లలితకళలలో జిత్రకళ యొకటి. నేటికిని మన దేశమున దీనికి గౌరవ మర్యాదలు కలవు. భారతీయులు కళా హృదయులను విషయము నీ జగన్మోహన ప్యాలెసు ఋజువు చేయుచున్నది.

మూర్తి కళలలో 'శివాజీ చిత్రము' సొంపుగా నున్నది. దంతముతో జేసిన యేన్గులబారు, నెంటెల వరుసయు సుమనోహరముగ నున్నవి. పిమ్మట ఓల్డు ఇండియన్ ఆర్టు గ్యాలరీకి వెళ్ళితిమి. అట ద్వారము పై భాగమున 'ఓమ్' అను పదము వ్రాసియున్నది. అది మైసూరు మహారాజుగారు వైదిక సాహిత్య ప్రియుడని యాస్తికుడని చెప్పకయే చెప్పు చున్నది. అందలి నమూనా లన్నియు జగన్మోహనములు. ఒక సింగము నొక ప్రక్కనుండి చూచిన నేనుగువలెను, రెండవ ప్రక్కనుండి చూచిన గుఱ్ఱమువలెను గన్పట్టును. ఒక యేనుగు నొక వైపునుండి చూచిన సింహమువలెను రెండవవైపునుండి చూచిన బులివలెను గన్పించును. ఇది యొక బుద్ధిచాతుర్యము. మా యంతేవాసులు వినోదాశ్చ ర్యములు గురిసిరి. జగన్మోహన ప్యాలెసుయొక్క పై యంతస్తున కేగిన మైసూ రంతయు గన్పట్టును. ఆ వినోదమును గూడ జవిచూచి మహారాజుగారి గజశాలకు వెడలితిమి.

ఏనుగుల నెన్నడు చూడని మా విద్యార్థులు కొందఱు సంతోషమున గంతులు వైచిరి. అటనున్న యొక యేనుగు బిల్లను జూచి మా నరేంద్రుడు, "పందికి దొండము తగిలించిన నేనుగుబిల్ల యగు" నని యూహా ప్రపంచములో మునిగెను. ఏనుగు గున్నలు జంటలు జంటలుగా గలవు. మత్తేభములు సహితము మానవునకు లోనగుటవలన బుద్ధికిగల ప్రధానత సృష్టిలో నెంతకలదో యనిపించినది. అటనుండి యశ్వశాలకు బోతిమి. అట రకరకముల గుఱ్ఱము లున్నవి. అవి బాగుగ బోతరించి చియ్యబట్టి యున్నవి. పిదప వాహన శాల కరిగితిమి.

వాహనశాలలో రకరకములగు బండ్లు కలవు. వెండి బండ్లుకూడ గలవు. పట్టాభిషేక సమయమున బండ్లలో రాజబంధువు లూరేగింపుతో బయలుదేరెదరట. బండి పుట్టిన నాటినుండి నేటివర కది యెన్ని యవతారము లెత్తినదో యన్నిబండ్లు నట గలవు. దానిని శకట ప్రదర్శనశాల యన జెల్లును. అన్నిరకముల బండ్లు భారతవర్షమున నే మహారాజునకు నెచ్చోటను నుండవనవచ్చును. ఒంటెలు లాగునవి; ఏనుగులు లాగునవి; అశ్వములు లాగునవి; ఎడ్లు లాగునవి అన్నియు ననేక రూపములలో గలవు. మహారాజుగారి కారులు పెద్ద కర్మాగారమున గలవు. రాణిగారివి, రాజుగారివి, వారి పూర్వు లెక్కి తిరిగినవి, వేట తటి వెడలునవి రకరకముల కారు లందు గలవు. అవిచూచి యనంతరము జంతు ప్రదర్శనశాల కరిగితిమి.

జంతుప్రదర్శనశాలలో నెన్నో రకముల శుకశారికలు కలవు. వానితో మా నరేంద్రాదులు మాటలాడి యూడు

కొనిరి. పిదప కరికలభములను జూచితిమి. వానిలో నొక టింద్రుని యైరావతమును బోలిన తెల్ల యేనుగుగున్న. అది బలముగ లేదు. రెండు కలభములు చియ్యావట్టి పోతరించి యున్నవి. మీాద మావటీడు నీరు పోయుచుండ నవి చెట్టు నకు రుద్దుకొని శరీరమును గడిగికొను చుండెను. ఆ పని మాకు వింత కల్పించినది. పిమ్మట బెంగాలు బెబ్బులులను జూచితిమి. అవి మిగుల బెద్దవి. భయంకరముగ నున్నవి. ఎంత బెదరించినను గుఱక వెట్టుచు నవి లేవనైన లేదు. అనం తరము మృగరాజులగు సింహములను గాంచితిమి. స్వాతం త్ర్యమును గోల్పోయిన వీరజాతి వీరులవలె నదనునకై వేచి యున్న పగిది నవి మాకు గన్పించినవి. మే మెంత రెచ్చగొట్టి నను రాజగాంభీర్యమును వీడక మృగరాజుల మనిపించు కొన్నవి. లేళ్ళగుంపుపై దదనంతరము మాదృష్టి ప్రసరించి నది. వాని కన్నులు సొగసు లీనుచుండెను. మైసూరు భూభాగమున నెచ్చటను నిట్టి మృగాక్షులు కన్పట్టలేదు. అమాయికముగ మేమున్నకడ కవి పరుగిడివచ్చి మాచేతుల వంక జూడసాగినవి. మా నరేంద్రుడు తన జేబులోని వేఱుసెనగకాయలు పెట్టి వాని ముట్టెలను సవరించెను. దుప్పులును, గణుజులును గలవు. పోతరించిన జీబ్రా యొకటి గలదు. అది తెగమదించి యున్నది. చూచుటకు దాని చాఱలు ముచ్చటగ నున్నవి. హిమాలయప్రాంత భూముల వసించు శ్వేత భల్లూకములు కలవు. ఆగంతుకు లేమేని బెట్టెదరన్న తలపుతో నవి నీటిలో దిగివచ్చును. అవియుండు గదులలో నీటికుండులు కట్టియున్నవి. తాపము హెచ్చుగ నున్న అవి యం దీదులాడును. పిమ్మట నెఱారిపక్షుల,

నుష్ట్రపక్షులను వీక్షించితిమి. అవి దరిదా పైదడుగుల యెత్తున్నవి. మెడపై నీకలు లేవు. తక్కిన యీకలు పట్టువలె నుండి కనువిందు గూర్చును. వానిని నిప్పుకోళ్ళందురు. అనంతరము నీటిగుఱ్ఱములను గాంచితిమి. వాని యాకృతులు చాల పెద్దవి. శరీరనిర్మితి యేనుగును బోలును. ముఖము వెడల్పు. అది గుఱ్ఱమును బోలును. కాళ్ళు కుఱచలు, నోరర్ధగజము వెడల్పున విడును. మామూలుపండ్లు గాక రెండు పెద్ద దంతము లున్నవి. అవి సుమారాఱంగుళముల పొడవున నుండును. అవి పైకి గొలదిగ వంకరతిరిగి యుండును. అడవిగేదెయు, దున్నయు నాశాలలో గలవు. వాని పుట్టుక వింత మనోహరమైనది. వెనుకభాగము కంటె ముందు భాగము కొంచె మెత్తు. నాలుగుకాళ్ళును దెలుపు. ముఖముపై దెల్లనిచుక్క, తోక పువ్వుతోక, కొమ్ములు చెవుల ప్రక్కగ ముందునకు దిరిగి లావై కనువిందు గూర్చును. వన్యమృగములపై బ్రకృతి కింత ప్రేమ యెందులకో! జిరాపులు రెండున్నవి. వానిని మున్నెన్నడును మా యంతేవాసులు చూచియుండలేదు. అవి తఱచుగ నాఫ్రికా యెడారిలోనే పుట్టును. వాని మెడ లా జంతువుల వెన్నుకంటె నొకటిన్నర రెట్లధికము. రకరకముల కోతు లున్నవి. కేవలము మానవునిబోలిన కోతులును గలవు. వానిని జూచినపుడు డార్విను మహాశయుని పరిణామ వాదముపైన నమ్మికలేని నాకును నమ్మిక పుట్టినదన నగును. బోనులో నొక తావున రెండుమూడజగరములు పడియున్నవి. చలనమేమియు లేక మూర్తీభవించిన యలసత్వమువలె గన్పట్టినవి. వానిసి గాంచినపుడు పూర్వస్మృతి మనస్సునకు దగిలినది. బస్తరు

తెలుగు దేశములోనిదిగదా! అచటి జనులు తెలుగు మాట్లాడువారు. ఆంగ్లపాలకులు దానిని యుక్తప్రాంతమున మేళగించిరి. బస్తరుప్రాంతమున భయంకరారణ్యములు మెండు. ఒక యటవి దరిని 'ఎదిర' యను గ్రామ మున్నది. అందు మా సోదరులు వలసవెళ్ళి స్థిరపడి యుండిరి. వారిని జూచుటకు నేనట కేగియుంటిని. అరణ్యాదిదృక్షతో నొక నాడు నేను పసులకాపరులవెంట నటవీ మధ్యమున కరిగితిని. ఒకచోట బర్వతశ్రేణి వలయాకారముగ దిరిగి యున్నది. దాని నడుమ నొక్కెడ లతాగుల్మ పుంజములు కొన్ని గుబురుకొని యున్నవి. వాని నడుమ నొక యజగర మున్నది. అదియొక మృగశాబమును బట్టి పెనవైచు చున్నది. ఆ మృగశాబము మృత్యుముఖమున బడి తప్పించుకొనలేక దీనదీనముగ నఱచుచున్నది. ఆ యఱపు వినినతోడనే యించుకేనియు భీతిలేక పసులకాపరులు తమ మూపులపై గల పరశువులతో గబగబ దానిని డాసి తుత్తునియలు గావించిరి. కాని మృగశాబకము మాత్రము జీవింపలేదు. జ్యాలోని వానిని జూచినతోడనే యది జ్ఞప్తికి వచ్చినది. ఆలోచించిచూడ నజగరము మిక్కిలి సోమరి. అది యాహారమునకు యత్నింపదు. ఆకలి మితిమీఱినపుడు చచ్చినట్లు పడియుండుట తక్క యన్యగతి దానికి దోపదు. తన్ను సమీపించిన ప్రాణులను మాత్రము వీడదు. అమాంత మొడిసిపట్టి పెనవైచి చంపి వానిని గ్రమముగ మ్రింగివేయును. ఎట్టి వ్యాపారములేక సోమరిపోతులుగ నుండు వారి పద్ధతియు నింతే. వారి కుపాయము మెండు. జ్యాలో ద్రాచుపాములు, మూషికములు, నెమళ్ళు వేర్వేఱుగ

బంధింపబడి యున్నవి. పాపము శివుడు తన పరివారములోని పోరు మాన్పలేక బాధపడుచుండుటను గాంచి యీ జ్యూయధికారు లా తిర్యక్కుల నట్లు బంధించి వేర్వేఱుగ నుంచిరి కాబోలు. కొన్నియెడల మయూరములు వెలయుచున్నవి. మోములపై నిండుగ స్నోనలదుకొని యాపై బూవునద్దివిగ్గుతో దలదిద్దుకొని విద్యుద్దీపముల కాంతులకు వదనములు వెలవెల బోవుచుండ గల్లుగల్లున మ్రోగు కాలి మువ్వలతో గదన తాండవ మొనరించు సినిమానటులు మాకన్న మిన్నలగుదురా యని యడుగుచున్న పగిది నా మయూరములు ప్రకృతి ప్రసాదితములగు చిత్రవర్ణ శబలిత బర్హములు విప్పి విలాసలాస్య మొనరింప దొడగినవి. ఇట్టి నెమళ్ళ గుంపును మున్నొకసారి ఢిల్లీ ప్రాంతమున గల బులందషహరు జిల్లాలో ఇస్మాయిలుపూరునందు నేను గాంచియుంటిని. మఱొక్కయెడ మమ్ము గాంచినంత గంగారులు కంగారుపడి తమ యుదరగత చర్మ భస్త్రికలలో బిల్లల నిరికించుకొని నిడుదలగు వెనుకటి కాళ్ళతో జంగుచంగున నెగురుచు గంతులిడుచు లేచిపోయినవి. పిల్లలు తమ తల్లుల యొడులలో నిర్భయముగ నుండి "పిల్లలారా! మావలె మీరును మీ తల్లి దండ్రులను నమ్మి పట్టికొన్నచో నెన్నటికి మీకపాయము వాటిల్లదు సుమా" యను నీతిని మా విద్యార్థులకు బోధించుచున్న ట్లుండెను. విశ్వాసమే యుండవలెనుగాని తల్లిదండ్రులు దైవసమానులు కారని యెవరు నుడువగలరు? మొత్తముమీద నేనుజూచిన మద్రాసు 'జ్యూ' కంటెను లాహోరు 'జ్యూ' కంటె నిది గొప్పది. వివిధజంతువుల నిట గాననగును. చాల తడ విట నిలిచితిమి. హాయి ననుభవించి

తిమి. ఆనందించితిమి. కాని జంతుప్రదర్శనశాలకు రిక్తహస్తములతో బోజనదను క్రొత్త యనుభవమును సంపాదించుకొనుట జరిగినది. క్రూరమృగములు వినా తక్కిన జంతువులు, పక్షులు మన చేతులవైపు జూచుచు "మాకేమి తెచ్చినార"లని ప్రశ్నించుచున్నట్లు మనవంక దృష్టులు పఱపును. హంపీలోని కోతులు నేర్పిన యనుభవముతో మా నరేంద్రాదులు ముందుగనే జాగృతిపొంది రెండు జేబుల నిండ వేఱుసెనగకాయలు పోసికొనివచ్చి యటనున్న జంతువులకు వెదజల్లి యాడుకొనినారు. 'జ్యూ'నుండి వెలికివచ్చి యొకగుంట గ్రౌండులో గొంత విశ్రమించితిమి. అప్పటికి ద్యుమణి యస్తమింప నుండెను. జంతుప్రదర్శనశాలకు వెనుక 'ఠండీ సడకు'' కలదు.

ఠండీసడకున కరమైలు దూరము రోడ్డున కిరువైపుల సిమెంటు పోత స్తంభములు నాటబడి యున్నవి. ఆ కంబములపై నినుపబద్దలతోడి తీగ యల్లబడి యున్నది. మేము వెళ్ళిన తఱి వర్షములు లేమిని నది తెలుపిగా నున్నది. మాకది హంపీశిథిలములలో నొకభాగ మనిపించినది. మేము గుంటగ్రౌండు త్రోవను మహారాజ ప్రాసాదమును జేరితిమి.

రాజప్రాసాదమునకు ద్రోవలు పెక్కున్నవి. అన్నిటి వెంట జనులు తండోపతండములుగా బ్రాసాదమును జూచుట కరుదెంచుచుండిరి. ప్రాసాదముకడ జక్కని పోలీసు బందోబస్తు కలదు. స్త్రీలు కూర్చుండు తావు వేఱు; పురుషులు కూర్చుండు తావు వేఱు. అంత జనమున్నను ద్రొక్కిడి లేదు.

రాజప్రాసాదము మిక్కిలి యెత్తైనది; విశాలమైనది. దానిపై సువర్ణ కలశములున్నవి. ఈకలశము లమృతసరునం దలి సిక్కుల దేవాలయముపై గల సువర్ణ కలశమును దల పించుచుండును. దాని ముంగిలినేల చాల విశాలమైనది. రెండుమూడు లక్షల జనమునకది సరిపోవును. రాజప్రాసాద ముతోపాటు పరిసర ప్రదేశము లన్నియు విద్యుద్దీపపరిశోభిత ములు; తదలంకృతములు; కావ్యవర్ణితమగు నింద్రసభా భవనముకూడ దద్భంగి నెసంగదు. ఆప్రాసాద మధ్యభాగమున సువర్ణ సింహాసన మున్నది. అది ఢిల్లీనగరమున షాజహాను కట్టించిన లాల్ కిల్లాలోని మయూర సింహాసనము మాడ్కి నెత్తైన ప్రదేశమున నుండును. దానిపై నధివసించి మహా రాజుగారు ప్రజలకు దర్శనమిత్తురు.

రాజసింహాసనమున కిరువైపుల రాజోద్యోగులు బారులుతీరి కూర్చుందురు. రాచదర్బారులో గూర్చుండ వలయునన్న మైనూరు ప్రభుత్వమునకు దరఖాస్తు పెట్టుకొన్న మంజూరగును. దుస్తులను రెండున్నర రూపాయలకు బజా రులో నద్దెకిత్తురు. రెండున్నరరూపాయ లద్దెకును మనుష్యులు కూడ దర్బారులో లభింతురు. కొలువుకూటములో నున్న మహారాజుగారికి ప్రభుత్వోన్నతోద్యోగులు వారి వారి హోదాల క్రమమున శాల్యూటుచేసి వెళ్ళుదురు. వందనము లొనర్చువారి యభ్యాసమును బట్టియు నుండును. ఎవరికి వచ్చిన క్రమములో వారు చేయనగును. నమస్కృతు లొన ర్చినవారు ముఖము రాజుగారివైపు పెట్టి వెనుకకు నడతురు. ఇదిచూచినపుడు, 'నావిష్ణుః పృథివీపతిః,' అని ప్రచార మొనర్చినరోజులు గుర్తునకు వచ్చును.

రాచదర్బారులోని దృశ్యము మనోజ్ఞము. పట్టపుటేన్గు మహారాజుగారి సింహాసనమును సమీపించి వింజామర విసరును. తన వెంటవచ్చిన ధవళాశ్వముమీది పూలను గరమెత్తి మోడ్చి స్వీకరించి యాపూలను మహారాజుగారిపై జల్లి మఱల గరము మోడ్చి నమస్కరించును. అంత నెద్దుపై నెక్కి వెంటవచ్చిన యతడు నగారా వాయించును. ఆ దృశ్యము తిలకించినపుడు నా శరీరము పులకించిపోయినది. ఎంతటి తయారా పట్టపుటేన్గున కొసగిరో! రకరకముల వేషములు గల యాతాయాత జనమునకు మితియుండదు. అలంకృత గజరాజములు కొన్ని ప్రాసాద ప్రాంగణమున నిలిచియుండును. వాని సమీపస్థములగు రెండుమూడు నెలల వయసుగల యేనుగుబిల్లలు చూడ ముచ్చట గొల్పినవి. నాటిరేయి మే మనుభవించిన హాయి వర్ణనాతీతము.

మైసూరులోని రాజబంధువులకైన యతిథి మందిరము మనోజ్ఞముగ కట్టడము. దీనిని జూచినపు డలీఘురు సమీపగతమగు రాంపూరు నవాబుగారి యతిథిమందిరము స్మృతికి వచ్చినది. అదొక దివ్యభవనము. మహారాజులకు నివాస సీమ. బీదలదృష్టి పడిన నది మాసిపోవును. దీనిని గెస్ట్ హౌస్ (Guest House) అందురు.

చాముండీశ్వరి కొండను 'జాముండీ పహాడ్' అనియు నందురు. ఈ కొండపై జాముండీశ్వరి మనోహరమందిర మున్నది. ప్రతి మంగళవారము మహారాజుగారు దేవీపూజ కటకేగుదురు. కొండమీదికి గారుపోవుమార్గ మున్నది. ఇవి యన్నియుగాంచి శివసముద్ర జలపాతము సరయ బయులు దేరితిమి.

శివసముద్ర జలపాతము మైసూరునకు నలువదియైదు మైళ్ళదవ్వున నున్నది. కాల్యములు నెరవేర్చుకొని భోజనాదులు వెంటగొని మా జట్టు బస్సులో బయలు దేరినది. బస్సు సర్వీసు సర్వసాధారణము. మేము ప్రత్యేకముగ బస్సు మాట్లాడుకొంటిమి. కావేరీనది రెండుగా జీలి కొండలపైనుండి రెండు మార్గముల వెంట గ్రిందికిబడును. నాలుగువందల యడుగుల యెత్తుననుండి యీకావేరి పడుచున్నది. క్రింద బెద్ద యగాధము. కావేరీ ప్రపాతమున కిరువైపుల నెత్తైన కొండ లున్నవి. ఆ కొండల నడుమగుండ జాలలోతున నా కావేరి ప్రవహించును. ప్రపాతమును జూచుటకు వీలుగా నెత్తైన ప్రదేశమున నినుప కటకటాలు కట్టబడి యున్నవి. ఇంకను దిగువకు దిగి చూచుట కనువుగా మెట్లున్నవి. మెట్లకు దిగువ గుహవంటి యొక చిన్నగృహము నిర్మితమైయున్నది. అట నుండియు దిగువకు మార్గమున్నది. అది చెట్లతో బుట్లతో నిండి క్రిక్కిరిసి యుండును. దాని వెంట నడచుట కష్టము. అట్టియడుగున కేగినచో నట నొక రాతిబండ కలదు. అది ప్రకృతి నిర్మించిన వేదికవలె నున్నది. విశాలముగ నున్నది. అందు విశ్రమించినచో గావేరీ జలప్రపాత శీతలవారి కణపూరములుపడి హాయిని గొల్పును. పదపడి యటనుండి మూడు మైళ్ళ దూరమునగల విద్యున్నిర్మాణకేంద్రమున కరిగితిమి.

1902 వ సంవత్సరములో మైసూరు దివానుగా నుండిన కె. శేషాద్రి అయ్యరు శివసముద్ర జలపాత సమీపములో, గావేరీతీరమున విద్యుదుత్పాదన కేంద్ర నిర్మాణమునకు బునాది వేసి యటకు దొంబది రెండు మైళ్ళ మేరలోనున

కోలారు బంగారుగనుల దనుక హైటెన్షను ఎలెక్ట్రిక్ తీగలు వేయించినాడు. ప్రాథమికదశలో నైదువేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని మాత్రమే యిది యుత్పత్తి చేయఁగలిగినది. 1940 వ సంవత్సరము వచ్చుసరికి నలుఁవదియైదువేల కిలోవాట్ల విద్యుదుత్పత్తి కాసాగినది. షింషా ప్రాజెక్టు, జోగ్ జలపాత నిర్మాణ కార్యక్రమము పూర్తియగుఁటతో దీనిశక్తి లక్షడెబ్బదితొమ్మిదివేల కిలోవాట్లకు బెరిగినది. భారతవర్షమున నింతటి విద్యుదుత్పాదనకేంద్రమే యితరప్రాంతమునందును లేదనియే చెప్పవచ్చును.

విద్యున్నిర్మాణ కేంద్రమునకు నదీతీరమున గొండల నడుమగా సుమారు నాలుగువందల యడుగుల యడుగునకు బోవలయును. అచ్చట యంత్రముల మూలమున విద్యుత్తు నిర్మింపబడుచున్నది. దానిని జూచుటకు టికెట్టు వలయును. కొండపైనుండి విద్యుత్తుసాయమున రెండు ట్రాలీలు నడచుచుండును. ఒకటి పైకివచ్చిన మఱియొకటి దిగువకు బోవును. వాని మార్గ మాదోకగ నాలుగువందల యడుగుల లోతుండును. చూచుటకు భయంకరముగ నుండును. మాజట్టు నిర్భయముగ ట్రాలీలెక్కి క్రిందికిబోయెను. అచటి పరిచారకు డదియంతయు మమ్ము ద్రిప్పెను. దానినిగూర్చి నేర్చుకొన్నది హృదయ గర్భితము. పైకి నున్న. అయినను నేటి వైజ్ఞానికుల బుద్ధికుశలతకు దార్కాణమనవచ్చును. క్రమ్మఱ బైకి వచ్చితిమి. భుజించి బస్సునెక్కితిమి. కాలాతీత భోజనము నిద్రకు కారణముకదా! బస్సులో నొకరినొకరు నానుకొని యూగిసలాడిరి. బస్సుయొక్క కదలిక యూయల నూపినట్లయ్యెను. అటుపిమ్మట బృందావనమున కరిగితిమి.

బృందావనము స్వర్గసీమనుండి విడివడ్డ యమృతఖండము. నందనవనములోని నిగ్గెల్ల నిచట రాశీకృతమై యుండు నేమొ. ఇటగల సొగసు లమరఖండమున నుండి యుండవు. అది మిన్నేటి కెలన నుండవచ్చును. ఇది మిన్నందు గిరిశ్రేణుల నడుమగా జాలువారు కావేరీనది యొక్క పాయలకు నడుమ విలసిల్లును. కావేరిపాయలపై కృష్ణసాగరడాము, డామునకు బురోభాగమున నీ బృందావన మలరారుచుండును. దీనికి ప్లాను వేసినది యాంధ్రుడగు మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారను నింజనీరు. కావేరీనదికి ఉత్తరదిక్కున గల కాలువకు విశ్వేశ్వరయ్య కెనా లని పేరిడిరి. బృందావనము నుండి చూచి నచో నాయానకట్ట గగన చుంబియగు నొకగిరివలె గన్పట్టును. సమకాలికము లగుటగాబోలు దీనికిని నైజామునగల నిజాముసాగరుడామునకును చాల సామ్యము గలదు. బృందావనమున నొక హోట లున్నది. బృందావనమున గల కాల్వలు గచ్చుతో నిర్మింపబడినవి. కాల్వలలో శతసహస్రములుగా విద్యుద్దీపములు చిత్రవర్ణ శబలితములై వెలయుచుండును. ఆ కాల్వల తీరములందు వివిధపరిమళ కుసుమవిసర విరాజితములై సుమవనులు గుభాళించు చుండును. అవి నయనములకే కాదు; మనోనయనము లకుగూడ దనుపు గూర్చును. అంతియే కాదు. జలయంత్ర పరంపరలు పెక్కులు. అవి యొకటికొకటి యభిముఖముగా నుండి సరసములాడుచు వసంతములు చల్లుకొనుచున్న పగిది నుండును. ఒక్కొక్కచోట నేడెనిమిది యభిముఖముగా నుండి పెండ్లినాటి ముత్తైదువ లెదురుసన్నాహము లొనర్చు కొనుచున్న ట్లుండును. మఱియొక విచిత్రవిషయము;

కావేరిలో దరిదాపిరువదిరైదడుగుల యెత్తున కెగురు విచిత్ర జలయంత్ర మొకటి కలదు. ఇది రేయి కనుపించు నిమిత్త మొక విద్యుద్దీపము జలమున నమర్పబడి యున్నది. ఒక చక్కని యమరవిలాసవతి జలకేళి సవరించు సమయమున జలాంతర్భాగమునుండి మింటి కెగయుపోల్కి నిది కన్పట్టును. ఇట్టి విచిత్రము లెన్నో యిందు గలవు. రంగురంగుల విద్యుద్దీపములతో నీ బృందావనము తళారించి గుబాళించు చుండును. దీనిముందు నందనవనము బలాదూ రనిపించును. కావేరిపై బోటులో విహరింపనగును. నవరాత్రములందే కాక ఇతర వేళల యందును దఱచు యాత్రికులు బృందావన దర్శనార్థ మరుదెంచుచుందురని విందుము. అట్టి మధుర సుందర మనోజ్ఞ ప్రదేశము భారతభూమిలో మఱెచ్చటను లేదనవచ్చును. లాహోరునగల రావినదీ తీరమునందలి షహాదర యను ప్రదేశము జ్ఞప్తికి వచ్చెనుగాని యింతటి సౌందర్య వైజ్ఞానిక ప్రజ్ఞాధురీణత యట గన్పింపదు. యావద్భారతవర్షమెల్ల నిట్టి బృందావనముగా నేనాడు మాఱునో గదా! ఇట్టి సుందర మధుర దృశ్యములను నిర్మింపజేసిన మహారాజుగారు కేవల ముదారులే కాదు; సహృదయులని కూడ నుడువవలయును. రాత్రులందు విద్యుద్దీపముల వెలుగున బృందావన సౌందర్యమునుగాంచి నేత్రములను జరితార్థ మొనరించుకొంటిమి. రాత్రి తొమ్మిదిన్నర గంటలకు బస్సులో మైసూరు మకామునకు జేరి భుజించి నిద్రించితిమి.

శ్రీరంగపట్టణము మైసూరునకు బది మైళ్ళ దూరమున నున్నది. ఇది కావేరీ బాహుబంధమున నున్నది. చుట్టును

దీనిని కావేరి పరివేష్టించి యున్నది. పట్టణమునకిది యగడ్త యనవగును. శ్రీరంగపట్టణము చుట్టును బెద్దకోటగలదు. ఇది టిప్పుసుల్తాను నివాసభూమి. టిప్పుతండ్రి హైదరాలీ మొదట మైసూరునకు దివానుగా నుండి కడకు స్వతంత్రుడై రాజ్యమును స్థాపించి శ్రీరంగపట్టణమును రాజధానిగ జేసికొనెను. హైదరాలీ మరణానంతరము టిప్పు రాజ్యమునకు రాగా నతనిని నాంగ్లేయుల సాయముతో మైసూరు ప్రభువగు మొదటి కృష్ణరాజయొడయారోడించి శ్రీరంగపట్టణమును శ్మశానమును గావించి యాక్రమించెను. నేటికి నిందు టిప్పు యొక్క దర్బారు మహాలు చెక్కుచెదరక నిల్చియున్నది. దానికి నలువైపుల ద్వారములు కలవు. మీద విశాలమగు సంతెస్తు కలదు. దానిపైనుండి టిప్పు ప్రజలకు సింహాసనాసీనుడై దర్శన మిచ్చువాడట. ఆంగ్లేయులతో టిప్పు విజితుడైన నాటినుండియు శ్రీరంగపట్టణము తన వైభవమును గోల్పోయినది. కోటలో నొక భూగృహము కావేరి నానుకొని యున్నది. అందు శత్రువులను టిప్పు నిర్బంధించెనని చెప్పుదురు. టిప్పుగోరి చక్కగ నున్నది. దానికమర్చిన నల్లరాల దరవాజాలు మానవ సుసాధ్యములుగా గన్పట్టవు. అందు నీడ కన్పించును. రాతిపై జేసిన శిల్పము భారతవర్షమున లేదనవచ్చును. ఆ గోరీయందు టిప్పు తండ్రియగు హైదరాలీ, యతనిభార్య, టిప్పుయొక్క గోరీలు వరుసగ గలవు. టిప్పును బెంచిన యుపమాత సమాధి నల్లరాతితో వెలుపల గట్టబడియున్నది. కావేరీనది తన బాహుబంధమున బిగించి టిప్పు నెంత రక్షించినను నంతిమ విజయము శత్రువులకే లభించినది. నేడు టిప్పు వంశీయు లట నెవరును లేరు.

ఆంగ్లేయుల గోరీ లట చాల కలవు. కావేరీతీర భూగృహము నకు సమీపమున శ్రీరంగశాయి దేవాలయ మున్నది. దానిని టిప్పుసుల్తాను పోషించెడివాడని ప్రతీతి. అందు శ్రీరంగ శాయి శయనించి యుండును. భార్య వేఱొకచోట నిలబడి యుండును. అంత పెద్ద దేవాలయమును జూచినపుడు కాశి లోని పెద్ద దేవమందిరములు గురుతునకు రాకమానవు. శ్రీరంగపట్టణము పతనమైనందులకు జాల చింతించితిమి. టిప్పుకాలమునాటి రథ మొకటి యున్నది. అచట నొకరాతి దూలమున దొలచిన వలయము గలదు. దేవాలయావరణము లోని కేగవలయునన్న జెప్పులను ప్రాకారమునకు వెలుపలనే వీడి వెడలవలయును. శ్రీరంగ పట్టణమును ప్రవేశించుటకు రైలువంతెన, బండ్లవంతెన రెండును గలవు. టిప్పు దర్బారు భవనమును దానిపైగల చిత్రజాలమును దిలకించి యటగల పచ్చికపై గొంత విశ్రమించి కావేరీ మధురాంబువుల గ్రోలి బస్సుకడకు వచ్చితిమి. అచ్చట గొబ్బరి బొండములు హెచ్చుగ దొరకును. అవి పుచ్చుకొని బృందావనము వచ్చి యటనుండి మైసూరుచేరి యక్కడ నుండి మదరాసు నకు బయనమైతిమి.

## ఎనిమిదవ మజిలీ

## మద్రాసునగరము

పండితుని సత్రమునుండి సామానులతో మైసూరు స్టేషనునకు వచ్చితిమి. బండిలో మద్రాసునకు బయనమైతిమి.

త్రోవలో గ్రమ్మఱ శ్రీరంగపట్టణము గాంచితిమి. అలహా బాదునందలి త్రివేణీసంగమమునగల కోట శ్రీరంగపట్టణపు గోటను జూడగా గుర్తునకు వచ్చినది. గంగాయమున లాకోట కిరువాగుల బ్రవహించును. గంగాజలములు ధవళములై యమునాతోయములు శ్యామలములై యడుగుకన్పించును. అట్లే కావేరీ జలములును గడు స్వచ్ఛములై కోటచుట్టును బరివేష్టించి యడుగు కన్పట్టుచుండును. త్రివేణీసంగమమున గల కోట సమీపమున నిచ్చటి శ్రీరంగనాథుని విగ్రహ మును మించిన హనుమంతుని విగ్రహ మొకటి బిలాగర్భ మున బడియున్నది. లంకనుండి యయోధ్యకేగుచు హను మంతు డిట విశ్రాంతిగొనియున్నాడట. అని యచటి పండాల నుడులు. తత్త్వమునకు గడుదూరములు.

శ్రీరంగపట్టణమున నొక కర్ణాటాంధ్రుడు మేమున్న రైలుపెట్టెలో నెక్కెను. అతనితో బరిచయ మేర్పడినది. మైసూరు మధురదృశ్యముల ప్రసంగము వచ్చినది. దానిపై మా విద్యార్థు లతనితో రాజవంశ ప్రసంగ మెత్తిరి. అంత నత డిట్లు నుడివెను. "మైసూరు రాజవంశములోనివా రెవ్వరు నితరవంశములతో పరిణయ బాంధవ్య మొనర్పరు. అది వారి సంప్రదాయము. కాని ప్రస్తుత మహారాజుగారు సంప్ర దాయమును మార్చిరి. వారిపేరు కృష్ణరాజవడయారు. వారు మహారాష్ట్రమునందలి కొల్హాపూరు రాజకన్యను వివాహమాడిరి. అది వారి రాజబంధువులకు దలకంటగింపుగా మాఱినది. నిరసనమును వెలిపుచ్చుటయకాక మెల్లమెల్లన నడ్డుకొని యెదిరించి పోరు పెట్ట దొడగిరి. అంతలో రాజ

మహిషి గర్భవతియైనది. బంధువైరమును మహారాజుగారు డీకొనుచుండగా నవమాసములునిండి భార్య చక్కని మగ బిడ్డను బ్రసవించినది. దానితో రాజమహిషికి రాజుగారికి బ్రణయబంధము మితిమీఱి బిగిసినది. అది గట్టిపడి రాయి వాలినది. అంతమాత్రమున రాజబంధువు లూరకొందురా? సంప్రదాయ విరుద్ధమని కల్లోలమును బుట్టించి పోరు ఘోర మొనర్చిరి. తుదకు రాజబంధువులకే జయమబ్బినది. ప్రణయబంధము మెలమెల్లన బ్రిదిలి యూడిపోయినది.

"చెప్పులోని రాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోని పోరు నింతింత కాదయా!"

అని వేమనయోగి యూరక చెప్పెనా? ఇంటిలోని పోరు పడలేక ప్రణయవతియగు నిల్లాలిని మహారాజుగారు వదలివైచిరి. బంధుకోటిలోని యొకకన్యను వివాహమాడిరి, ద్వితీయ కళత్రమున కిరువు రాడుబిడ్డలు. ప్రథమ కళత్రము దీనదీనయై పితృగృహము స్వపుత్రునితో జేరినది. దైవవిని పాతమును దలపై దాల్పకుండ గడపగలవా రెవ్వరుందురు?" అని యతడు నిట్టూర్పువుచ్చెను. అంతలో మానవేంద్రు డొక రీతిగా ముఖము పెట్టి "నరేంద్రులు కూడ భార్యలను విడిచి పుత్తురా" యని సాకూతముగ నాశ్చర్యమును బ్రకటించెను. అతనికి సమాధాన మాకర్ణాటాంధ్రుని ముఖమునుండి యూడి పడలేదు. తోడి విద్యార్థులవంక జూచెను. వారు నవ్విరి. అంత నావంక దన బ్రాశ్నిక నిరీక్షణములను బఱపెను. అంత నేను సానునయముగ నిట్లంటని. "నరేంద్రులును మాన

వులే యగుదురు. సామాన్య మానవులకంటె మానవుల కధిపతులమని చెప్పికొనువారే నరేంద్రులు. వారి కులము లోనే యిట్టి దురన్యాయములు పెక్కులు జరుగుచుండును. నూటికి గోటికొకరు మైసూరు మహారాజువంటివారు నీచము లగు కులసంప్రదాయములను బెళ్ళగించుటకు బ్రయత్నింతురు. తుట్టతుదకు బెళ్ళగింపలేక కట్టుబాట్లకు దలయొగ్గి యిట్టి దుర్భర పరిస్థితులకు లోబడుదురు. కొందరు కీర్తికొఱకై లేనిపోని నిందలను నమ్మి యిల్లాండ్రను వదలిన రాజకుటుంబ విభులును గలరు. దీని కుదాహరణముగ నిందుచూలాలగు సీతాదేవిని వదలిన శ్రీరామచంద్రుని జెప్పికొనవచ్చును. కొంద ఱెన్ని యాపదలు వచ్చినను దాము ప్రేమించిన ప్రణయవతిని వీడక నిలిచిన యుదారమూర్తులగు రాజకుమారులును గలరు. సూర్యుడ స్తమింపని యాంగ్లమహాసామ్రాజ్యమునైన వదలుకొనెను గాని, యష్టమ ఎడ్వర్డు మహాచక్రవర్తి తాను ప్రేమించిన సింప్సన్ సతిని వదలలేదు. మంత్రులు, శాసన సభాసభ్యులు, రాజబంధువులు, శిష్టాచార సంపన్నులు గగ్గోలు పెట్టినను నతడు లెక్కచేయలేదు. నిజము పరికింప భార్యను, నందులో బ్రణయవతిని, బుత్రవతిని విడిచిపెట్టుట పురుష లక్షణమునకు విరుద్ధము.'' అని నేను నుడివినంతనే యువతుడు కొంత శాంతినొందెను.

మైసూరును వీడి బెంగుళూరునకు వచ్చు త్రోవలో గ్రామములపై గ్రద్ద లధికముగ నెగురుచు గాన్పించును. అట బట్టుపరిశ్రమ యధికము గావున నీపురుగులకై యవి విశేష ముగ నెగురుచుండును. ''మాండ్యా'' లో బంచదారమిల్లు

గలదు. బహుధాన్య నగరము (బోధన్) నందలి పంచదార మిల్లులకంటె నిచ్చట బంచదార యుత్పత్తి తక్కువ. మద్దూరునందు బట్టుబరిశ్రమ మధికము. సాయంకాలమునకు బెంగుళూరు వచ్చితిమి. మదరాసునకు బోవు బండి కింకను నాలస్య ముండుటచే నట భోజనము లొనర్చితిమి.

పిమ్మట మదరాసు మెయిలులో సామానులు సర్దుకొంటిమి. కొందఱు సామానులు పెట్టెడి మీది బల్లపై మా విద్యార్థులు పరుండిరి. వారిలో మా నరేంద్రు డొకడు. బంగారుపేట స్టేషనులో నతడు నిద్రించుచు పైనుండి క్రిందికి నిద్రమగతలోనున్న తన సహచరులపై బడెను. కాని యెవరికిని దెబ్బలు తగులలేదు. కొందఱకు నిద్రాభంగ మేనియు గలుగలేదు. బంగారుపేట మైసూరు ప్రాంతమునకు దమిళ ప్రాంతమునకు మధ్యభాగమున నున్నది. ఇటనుండి కోలారు బంగారుగనులు దరిదాపు నలువదిమైళ్ళలో నున్నవి. ఇచ్చటి నుండి మీటరుగేజి రైల్వేలైను గలదు. కోలారుజిల్లా యచ్చముగ దెలుగుజిల్లా. కాని యది మైసూరున మేళగింపబడినది. బంగారుపేటలో దెలుగు మాటలాడువా రధిక సంఖ్యాకులు. ఆ తెలుగునేలకు విముక్తి యెన్నడో!

అమందానంద కందళిత హృదయారవిందులమగుచు భానూదయమునకు జెన్నపట్టణము చేరితిమి. సెంట్రలు స్టేషనులో దిగి మేమెల్లరము కాల్యముల దీర్చుకొని స్నానమాడితిమి. అనంతర మెగ్మూరు స్టేషనునకు సమీపమునగల కన్నయ్యసెట్టి సత్రమునకు జేరి యందు బసచేసితిమి. చెన్నపట్టణమునకు మదరాసనియు మరియొక పేరు గలదు. తెలుగు

వాడగు చెన్నప్పచే నిర్మితమగుటవలన జెన్నపట్టణమని నామము వచ్చినది. ముదిరాచ లేక ముతరాచ అను తెనుగు జాతి యొకటి యచట నివసించుటచే దానికి మదరాసని పేరు వ్యవహరింపబడినది. ఎటుపరికించినను జెన్నపట్టణ మాంధ్రపట్టణము. ఆంధ్రుల వాణిజ్య శక్తివలననే యది యంతటి మహాపట్టణమైనది. అట్టి పట్టణమునకైన తెనుగు హక్కు మనవారు చేతులార వదలుకొన్నారు. ఆవిషయమై యించుక మధనపడి పిదప భోజనము లొనర్చి యెగ్మూరున గల మ్యూజియమును జూడ నరిగితిమి.

మ్యూజియముయొక్క భవన మంతస్తులతో కొండ రాతి కట్టడముతో సుదృఢముగా నున్నది. శిలాశాసనములు, శిలామూర్తులు, శిలామూర్తి ఖండములు, చాళుక్య చోళాది పూర్వచరిత్ర రాజుల కాలపరిమితినిబట్టి శ్రేణులు శ్రేణులుగా నాటబడి పేర్చబడి గంభీర కళాసంపదను వెల్లి గొల్పుచున్నవి. బౌద్ధస్థూప శిలామూర్తి ఖండము లొక శ్రేణిగా నున్నవి. వానివాని దిగువ లఘువివరణ మున్నది. అన్నియు బరిశీలింపవలయు నన్న గొన్ని దినములు పట్టును. భట్టిప్రోలు నందలి బౌద్ధస్థూపమును ద్రవ్వి యందుండి తీసినట్టి బుద్ధుని యస్థికలనుంచిన స్ఫటికపు బరిణ యందున్నది. దానిని గనులపండువుగా జూచితిమి. అందు జూడదగి నవి పెక్కున్నవి. అతివిశాల మహోన్న జంతు సర్ప పక్షి ప్రముఖ జీవరాసుల కంకాళములు, చర్మము, ఱెకలు, దంతములు, కొమ్ము, లస్థిపంజరములందు భద్రపఱుపబడి యున్నవి. అందును రకరకముల పక్షుల శవములు, సర్ప

ముల కాయములు, జంతువుల దేహములు గాంచనగును. అంతటి విజ్ఞాన ప్రదర్శనమున కెంతయు నలరి యటనుండి బయలు దేరితిమి. పిదప ఫోర్టుస్టేషనులో బండిదిగి హైకోర్టున కేగితిమి.

హైకోర్టు బ్రహ్మాండమగు నొక పెద్ద బిల్డింగు. దాని లోని భాగములను గనుగొంటిమి. అందు పై భాగము లైటుహౌసున్నది. మెలికలు మెలికలు దిరుగుచు దానిపైకి లోపలనుండి యెక్కితిమి. చిట్టచివర కేగి చూచితిమి. మదరాసు వీధులు సమస్తము శ్రేణులు శ్రేణులుగా దీర్చి దిద్దినట్లు కన్పించినవి. సముద్రపు కెరటాలు, విసీల సముద్ర జలము మధురముగా గన్పించినవి. అనంతరము హార్బరును వీక్షింప నేగితిమి.

మావిద్యార్థులు హార్బరును జూచి ముగ్ధులైరి. అపార పారావార జలోపరిభాగమున శ్రేణులుగట్టి వెడలుచుండిన నౌకలనుజూచి మురిసిపోయిరి. ఆపిదప సెంటుజార్జికోటను, నం దాంగ్లేయు లుపయోగించిన యాయుధసామగ్రిని జూచితిమి. ఆ పిదప నుమ్మడిరాష్ట్రముగ నున్నప్పటి యసెంబ్లీ భవనమును వీక్షించితిమి. దానిని తిలకించి యొక నిట్టూర్పు పుచ్చితిమి. అనంతర మనంతవారాశీతీరము వెంట బడి తురంగములవలె లేచి గంతులిడు తరంగముల పరవళ్ళను దిలకించుచు మదరాసు యూనివర్సిటీ బిల్డింగులను జేరితిమి. దాని విశాల రమణీయ ప్రదేశములను మలయమారుత సౌకుమార్య విహారములను గనుగొని మెల్లన ట్రిప్లికేను బీచికి జేరితిమి.

త్రిప్లికేను బీచిలో మా నరేంద్రుడు, కిశోరబాబు, లీలా వేంకటరత్నము, వేంకటేశ్వరరావు మున్నగు టికెట్టు వన్ఫోర్తులు మా యనుమతినిగొని మున్నీటి కెఱటములతో నాడుకొనిరి. తుదకు సూర్యభగవానుని క్రుంకుపాటు, మా నిర్బంధము నోడలుమఱచి విహరించు నా విద్యార్థికిశోరముల తరంగక్రీడకు విఘ్నకారులైనవి. మెల్లమెల్ల నట గదలి మే మెగ్మూరు బసకు నాటికి జేరుకొంటిమి.

రెండవ దినమున వైమానికాశ్రమమునకు మిగుల దిదృక్షతో నహమహమికతో నరిగితిమి. మా రొట్టె నేతిలో విఱిగిపడినది. మా బుద్ధి కాంక్షించినది లభించినది. అపుడే యొక విమాన మెటనుండియో వచ్చి పెద్ద గండభేరుండ పక్షివలె నాశ్రమములో వ్రాలినది. చిటికెలో నధికారుల యనుజ్ఞ వడసితిమి. త్రుటిలో దాని నధిరోహించితిమి. మా నరేంద్రుడు పైలెట్టు (విమానచోదకుడు)గా మాఱెను. ఇక గిశోరబాబు ప్రయాణికుడుగా మాఱకుండునా ? కుఱ్ఱలందఱు అతనితోపాటు ప్రయాణికులుగా నటించి వినోదించుచుండిరి. ఇంతలో నిజముగ విమాన మెగురువేళ యైనది. అందఱు నవ్వుకొని హతాశులై విమానముదిగి బసకు జేరవలసి వచ్చినది. అనంతరము త్యాగరాయ నగరమున గల దక్షిణభారత హిందీప్రచారసభ కేగి యట దానికులపతి యగు శ్రీ మోటూరు సత్యనారాయణగారితో హిందీభాషా ప్రచారమునుగూర్చి ముచ్చటించితిమి. హిమాలయ శృంగమునుండి యడ్డమాకలు లేక క్రిందికి జాల్వారు గంగాలహరి వోలె వారి ముఖవీధినుండి వినిర్గతమైన భాషావచశ్ఛము

త్కృతి మా జట్టువారి నాశ్చర్యాశ్చర్యముల ముంచి లేవనెత్తి నది. వారు మహా మేధావులలో నొకరు. పిదప మా విద్యార్థులు మూరు మార్కెట్టును తిలకింప నుత్సుకులు కాగ నట కేగితిమి.

మూర్మార్కెట్టులో బ్రావడిన వస్తువులు పెక్కు లమ్మెదరు. పుస్తకములు, పెన్నులు, వస్త్రములు మొదలు కొని పెద్దపెద్ద భవనముల కుపయోగించునట్టియు, పెద్దపెద్ద బస్సులకు, సుందరములగు చిన్నకారుల కుపయోగించు నట్టియు నినుపసామానులు, పారలు, పలుగులు, కొడవళ్లు, మేకులు, సుత్తెలు, రంపములు మొదలగునవియు నమ్మెదరు. ఇంకను పెక్కురకము లుండును. వందరూపాయల సరుకు రెండురూపాయలకు వచ్చును. రెండురూపాయల సరుకు రెండువందల రూపాయలకు గూడ బోల్తాపడి కొనవలసి వచ్చును. విలాసవస్తువు లెన్నో రకరకములుగ నలంకరింపబడి కృత్రిమ సౌందర్యమున కుత్పత్తిస్థానము వలె మూరు మార్కెట్టు కన్పించినది. ఇటగల వస్తువులను కొనువారు సహస్రాక్షులై మెలగవలయునని విద్యార్థుల కెఱింగించి జాగ రూకులనుగా నుంచితిమి. ఆ పిమ్మట దాని ప్రక్కనేయుండిన పక్షుల మార్కెట్టును విద్యార్థులకు జూపితిమి. రకరకముల పులుగులు, కోతులు, కోళ్లు, చిలుకలు సజీవములైనవి యమ్మ బడును. కిలకిల, కిచకిచ ధ్వనులతో నా మార్కెట్టు నిండి యుండును. వానిని జూచి యాపిమ్మట 'జ్యూ' (జంతు ప్రద ర్శనశాల) ను జూడనేగితిమి.

టికెట్లుకొని జంతు ప్రదర్శనశాలలో ప్రవేశించితిమి. అన్ని ప్రాంతములు గబగబ దిరిగి వీక్షించితిమి. సింహములు, క్రోల్పులులు, కరులు, నక్కలు, తోడేళ్ళు, చిఱుతపు లెడగండులు, రేచుకుక్క, లడవి పిల్లులు, ముళ్ళపందులు, వన వరాహములును గలవు. మఱియు ప్రశాంత మధుర హృదయములగు పారవతములు, రాజహంసములవలె నున్న యొకజాతి పక్షిగణములు "జ్యూ"లో గన్పించినవి. బక మొకటి యొకచో నొంటికాల నిలిచి ధ్యాన నిమగ్నమై యుండెను. దానిని జూచినతోడనే మా విద్యార్థులు పరస్పర మవలోకించుకొని నవ్వుకొనిరి. చేపలులేని యీ మడుగున గూడ నీ బక మొంటికాలితో ధ్యాననిమగ్నమై యుండుటకు గారణమేమా యని వారు ప్రశ్నించుకొనుచున్నట్లు నే నూహించితిని. ఏది యెట్లున్నను నైజగుణము మాఱదుగదా? ఒకచో నీటిబల్లి యుండెను. అది దరిదాపేడెనిమిది యంగుళముల పొడవున నుండెను. దాని యాకారము వికారముగ నుండెను. తల పెద్దగ వెడల్పుగ నున్నది. అది సర్వవేళల నీటిలోనే మునిగియుండునట. దాని కాహారముగ గొన్ని కప్పలదియున్న జలమున నుంచబడి యున్నవి. ఆకొన్న యపుడెల్ల నది యొక్కొకటిగా నా కప్పల నారగించునట. పాప మా యమాయికములగు కప్పలు రానున్న ముప్పును గమనింపలేకయే యా జలాగారమున స్వైరవిహారము సల్పుచు గంతులిడుచున్నవి. అమాయికు లట్లే యుందురు కాబోలు! కృతకవిలాస విలసితమై రాణించు స్త్రీజాతికంటె వేయిమడుంగులు పురుషజాతి నిసర్గశోభాపరిపూర్ణమై

యందగిల్లు ననుమాట 'జ్యూ' జూచి మేము ప్రత్యక్షముగ దెలిసికొంటిమి. అనంతరము బసకు జేరుకొంటిమి.

చెన్నపట్నము కృతక సౌందర్యము రాశీభూతమైనట్లు విలసిల్లును. రైళ్ళు, ఎలక్ట్రిక్కు రైళ్ళు, బస్సులు, కార్లు, లారీలు, రిక్షాలు, ఆటోరిక్షాలు, సైకిళ్ళు, మోటారుసైకిళ్ళు, జట్కాలు, నొంటెద్దుబండ్లు నొకటేమిటి? ప్రతినిమిషమున గుంపులు గుంపులుగా వచ్చిపోవు జనములు, దుకాణములు, చిత్తాకర్షకములగు వింతలు, లాయర్లు, డాకర్లు, కాలేజీ ప్రొఫెసర్లు, విద్యార్థులు, విద్యార్థినులు, సంవాదకులు, ప్రభుత్వోద్యోగులు, నానావిధ కార్మికులు, షాహుకార్లు, బిచ్చగాండ్రు, దోపిడిగాండ్రు, జేబుదొంగలు పూచిన పూలమొక్కలవలె సింగారించుకొని తిరుగు విలాసవతులు నిసుకవైచిన రాలనిపగిది మద్రాసున కంటబడుచుందురు. ధర్మముకన్న నధర్మము, సత్యముకన్న నసత్య మచట బెత్తనము చేయుచుండును. "జనాకీర్ణంమన్యే హుతవహపరీతం గృహమివ" అని కాళిదాసు చెప్పినట్లు నిప్పంటుకొన్న యింటి చుట్టు మూగిన జనమువలె మదరాసున జనులు మూగి క్రిక్కిరిసి యుందురు. ఆత్మగౌరవ మాత్మశ్లాఘ యట నృత్య మొనర్చు చుండును. అట డబ్బున్నవాని మాట చెలామణి యగును. 'ధనంమూలమిదంజగత్తు' అను మాటకు దృష్టాంతము మదరాసగును. దయాదాక్షిణ్యముల స్థానమున గర్వవంచనములు నిలిచి పట్టణ సౌందర్యమునకు వన్నె దిద్దుచుండును. తొలుత చెన్నపట్నము మొకపల్లె. అది యింపొంది పెంపొంది మహాపట్టణ మైనది. పూర్వ మెన్ని యిట్టివి కాలేదు. ఎన్ని

స్మశానవాటికలుగా మారలేదు. విజయనగర మెంతటి విశాల పట్టణము. తుదకేమైనది ? తులాతులితమైన ధర్మము గర్విష్ఠ పట్టణములయొక్క భావిగతి ప్రజలే నిర్ణయింతురు. కాబట్టి పైపై మెఱుగులకు వన్నెచిన్నెలుపెట్టి జిలిబిలిగా మదరాసును వర్ణింపనేల ? నాటికి నా భావోద్వేగము నారీతి నడచుకొంటిని. పిదప మేమెల్లఱము ప్రయాణోన్ముఖులమై సెంట్రలు స్టేషనునకు జేరితిమి.

## తొమ్మిదవ మజిలీ

## తిరుగు ప్రయాణము

ఇంత దీర్ఘప్రయాణ మొనర్చిన మా విద్యార్థికిశోరము లను బరీక్షింపదలచి యట వారికి గొంత స్వేచ్ఛయిచ్చి పట్టణ మును దిలకింప బంపితిమి. వారును స్వానుభవమును జక్క నుపయోగించుకొని బోసుదొడ్డని పేరువడ్డ చైనాబజారునకు బోయి యచటి వింతదృశ్యములను గాంచి మాఱుపాటులేక తిన్నగా సెంట్రలుస్టేషనునకు మేమున్నకడ కరుదెంచిరి. వారి యనుభవమునకు మెచ్చుకోళ్ళను వారికి బహూకరించి తిమి. అంతలో బండికి వేళయైనది. గంట గణగణ మ్రోగు చుండ నెల్లరము లెక్కప్రకారము ధూమశకట మధిష్ఠించి తిమి. బండి పరవళ్లతో నురవళ్లతో బయలుదేరినది. గూడూరు త్రుటిలో జేరితిమి.

గూడూరు పెద్ద రైల్వేస్టేషను. ఇటనుండి తిరుపతికి మీటరుగేజు రైల్వేలైను కలదు. విశాఖోభయ గోదావరీ కృష్ణా గుంటూరు నెల్లూరుమండల ప్రజలు తిరుపతి కేగువారిచ్చట బండి మారుదురు. గూడూరులో సభ్రకపు గనులు గలవు. తిరుపతి యొక పవిత్ర పుణ్యక్షేత్రము. ఇట శ్రీ వేంకటేశ్వర యూనివరిసిటీ ఇటీవల వెలసినది.

కొండ దిగువనున్న పట్టణమును దిరుపతి యందురు. పైనుండు నాలయమును గ్రామమును గలిపి తిరుమల యందురు. ఇచ్చటి దైవము శ్రీ వేంకటేశ్వరస్వామి. ఈ దేవుని బాలాజీయని యుత్తరభారతీయులందురు. వేంకటేశ్వర దేవస్థానమును జోళభూపతి నిర్మింపజేసినట్లు బ్రహ్మాండపురాణమున గలదు. విక్రమార్కుడు పెక్కు శిథిలములను బాగు చేయించెనట. తొండైమాన్ నగపతి కట్టడములను బెక్కింటిని గట్టించెనట. దేవాలయభాగమున కరిగిన వెంటనే శ్రీకృష్ణరాయల విగ్రహము, రాయల రాణుల విగ్రహములు, వేంకటపతిరాయల విగ్రహము, నతని రాణి విగ్రహము కంటబడగలవు. కులశేఖర యనెడి పసిడిరేకు తాపిన ద్వారము, రామానుజ సన్నిధి, తొట్టితీర్థము, పూలబావి, వైకుంఠద్వారము మొదలగునవి దేవస్థానమున జూడదగినవి. పెక్కు జలపాతము లందున్నవి. నికటగిరి ప్రపాతములగు జలపాతము లచట బవిత్ర బుణ్యస్నాన తీర్థములుగా విలసిల్లుచున్నవి. ఆ పుణ్యక్షేత్రమున హైందవప్రజలు మ్రొక్కులు చెల్లించుకొందురు.

అట్టి మ్రొక్కులు చెల్లించుకొన్న కొందఱు స్త్రీ పురుషులు వచ్చి మాపెట్టెలో గూడూరు స్టేషనులో నెక్కిరి. వృద్ధులగు కాంతలే కాక పచ్చికాటూరని వయస్సులో నున్న యువతులుకూడ శిరోముండన మొనరించుకొని యుండిరి. వారినిగాంచి మా నరేంద్రుడు, 'ఆడువారుకూడ వలగొరిగించుకొందురా నాన్నా!' యని నావంక జూచెను. మా కుఱ్ఱని సందేహమునాప నక్కఱ కలిగినది. ఇట్లంటిని. "శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామివా రేడుకొండల దేవరే కాక సకల హైందవ ప్రజానీకమునకు మ్రొక్కుబళ్ళ దేవరయై భక్తుల వెంద్రుకల ముడుపునకు మిగుల రక్తి చూపెట్టును. వెంద్రుకల ముడుపు చెల్లించువారి కావేల్పు కోరిన కోర్కెలొసగును. అందుచే స్త్రీ పురుష భేదముగాని, పిన్న పెద్ద వాసిగాని పాటింపక యెల్లరా దేవునకు వెంద్రుకలు సమర్పించి వరములు పొందుచుందురు." నాసమాధానము మా నరేంద్రునకు నచ్చినట్లు లేదు. అతడు వెంటనే తాను లోగడ బట్టీపెట్టిన కవిరాజుగారి పద్దెము లేకరువు పెట్టసాగినాడు. మచ్చునకు రెండుమూడు పద్యము లిచ్చుచున్నాను.

"బొచ్చునొసంగి యెట్లు పరిపూర్ణ మనోరథ సిద్ధిఁబొందగా
వచ్చును? బిచ్చివాఁడనని భావమునం దలపోయుచుంటివా?
పుచ్చును నీదుపాపములు పోరచి మానుమ యిట్టివానినిన్
బొచ్చెము లిట్లు చెప్పి ప్రజమోసముచేయకు ధూర్తమానవా!

"తిరిపెమునెత్తియెత్తి యతిదీనతఁ దిర్గుచు జోలిబట్టుచున్
తిరుపతికొండమీఁది కెగదేకుచు వచ్చుట చెప్పుదెబ్బ వీ
వోరువుగఁదిన్న లేశమౌ ప్రయోజనముండదు ధర్మమార్గమున్
బిటేఁదికిఁ ద్రోసిపుచ్చి పరపీడకుఁ బూనిన ధూర్తమానవా?"

తిరుపతిఁబుట్టి; రంగపురి తెన్నులవర్ధిలి; కాశిలోపలన్
మరణము పొందినప్పటికి మారదు కర్మఫలానుభూతి; నీ
వెరిగియు దీని స్వార్థరతి నెల్లవిధంబుల నెంతమందినో
పురపుర నెల్లవేళలను మోసముఁజేతువె ధూర్తమానవా ?"

మొత్తముమిాద కవిరాజుగారి ప్రతిభా విశేషములు మా నరేంద్రుని గానమాధురిలో లీనమై జాలువాఱి వఱద గట్టి మమ్ము సుస్నాతుల నొనర్చి ముగ్ధులను జేసినవి. అంతలో నింకను వెంద్రుకల ప్రొక్కులు చెల్లించిన యాడువారును, మగవారును ప్లాటుఫారముమిాద నటునిటు పరువెత్తుచు ఫిరంగిగుండ్లను బోలిన తమ తలకాయలను వాల్చి కన్నులు మూసికొని మా పెట్టెలోని కెక్కుటకు ప్రయత్నించిరి. అంతలో బండి కదలినది. గూడూరు విడచి బిట్రగుంట మిాదుగా బండి గుప్పుగుప్పున బొగవిడుచుచు నెల్లూరు చేరినది.

నెల్లూరు పినాకినీ (పెన్న) నదీతీరమున నున్నది. "నెల్లూరు నెఱజాణ" లను పదము పెద్ద వాడుకలో నున్నది. జాణశబ్దము జ్ఞానశబ్దమునకు వికృతియగును. నెఱజాణ యన సంపూర్ణజ్ఞానము కలవారనిగాని నేర్పరితనములో మంచి జ్ఞానముకలవారనిగాని యర్థము చెప్పవచ్చును. ఇట్టి జ్ఞానమలవడుటకు నెల్లూర నొక విశేష ముండవలయును. నెల్లూరిలో మూలపేటయందు మూలస్థానేశ్వరుని దేవస్థానముకడ నొక నుయ్యి యున్నదట. దాని పేరు 'వేమాలనుయ్యి'. దాని జలములు మనోవాక్కాయములకు నవనవోన్మేష వికసనములు చేకూర్చు శక్తిగలిగి యుండునట. ఒక నెల్లూరికవి

విదేశవాసియై స్వదేశాగత బాలచంద్రుని జూచి ప్రశ్నించిన యొక చాటుపద్య మాంబావి విషయమును దెలుపుచున్నది.

'మల్లెల్ మొల్లలు సేమమా
సుకరమా మాకందముల్ సేదఁగుల్
మొల్లంబాఱక యుండునా సుద
తులున్ మోదంబు వాటింతురా
విల్లుంగోలయుఁ దీయునా మరుఁడు
నా వేమాల నూ యున్నదా
నెల్లూరన్ బెదసోమవీథినిగదా
నీరాక జైవాతృకా!'

మఱియు నెల్లూరుచరిత్ర ప్రసిద్ధమైనది. మనుమసిద్ధి నృపాలుఁడు దానిని బాలించెను. కవిబ్రహ్మయగు తిక్కన మంత్రిగా ఖడ్గతిక్కన సేనానిగా నలరారిరి.

మనుమసిద్ధి దాయాదులగు నక్కన బయ్యన లను వారు దండెత్తి మనుమసిద్ధి నోడించి నెల్లూరు గైకొన నతఁడు కందుకూరి సీమలోని పెంట్రాలకోటలో దాగియుండి కవి బ్రహ్మను, గాకతి గణపతిదేవుని సమ్ముఖమున కతని సహాయార్థము బంపెనట. కవిబ్రహ్మ తన భారతాఖ్యానమును విన్పించి, మెప్పించి, యొప్పించి గణపతిదేవ చక్రవర్తి సాయము గొనివచ్చి దాయాదులను బాఱద్రోలించి నెల్లూరికి దనయేలికను బునరభిషిక్తుని జేసెనట. ఇది ప్రసిద్ధమగు కథ. మఱియొక చారిత్రక కథగూడ గలదు.

కాటమరాజు కథ మనము వినుచుందుము. అతఁడు కనిగిరిసీమలోని యెఱ్ఱగడ్డపాటి కధిపతి. అతని తండ్రి పెద్ది

రాజు. పెద్దిరాజు తండ్రి వల్లురాజు. వల్లురాజాలవలపాటి కధి పతియైయుండెనట. అనావృష్టి దోషమువలన బసులకు బచ్చిక కఱవై నెల్లూరి ప్రాంతమునకు వచ్చి మనుమసిద్ధియొక్క పచ్చికబీళ్ళను బుల్లరికి గాటమరాజు గైకొనెను. తుదకు బుల్లరి యెగవైచి కాటమరాజు పసులను దోలుకొనిపోయెను. అందుచే గినుకవహించి మనుమసిద్ధి రణతిక్కనను సైన్య మిచ్చి కాటమరాజుపైకి బంపెనట.

రణతిక్కన తనతో దిరునామల తిప్పరాజు, శ్రీకంఠ రాజు, పెదవేగి చొక్కరాజు, పెదవరదరాజు, అర్లకొండ అచ్చిరాజు, ఆదివన్నె మాదిరాజు, గయికొండ గంగరాజు, ఉర్లకొండ సోమన్న, ఉదయాద్రి ఉమ్మన్న, మొదలగు మహాయోధులు నడవ దాడి వెడలెనట. కాటమరాజుకూడ దనతో బల్నాటి ప్రభువైన పద్మనాయడు, పల్లికొండ ప్రభువైన చల్ల పిన్నమనాయుడు, దోనకొండ అయితమ రాజు, ఎఱ్ఱయ్య, భట్టావులరాజు, కరియావులరాజు, వల్లభన్న, నాచకూళ్ళనాయడు, నేతిముద్దయ్యనాయడు, పాచయ్యనాయడు, ముమ్మయ్యనాయడు, పుత్తమరాజు మున్నగు యాదవ వీరాధివీరులు వెంటనడువ యుద్ధమునకు బయలుదేరెనట. కాటమరాజు సైన్యమును బ్రహ్మరుద్రయ్య నడిపించెను.

ఉభయ సేనానులగు ఖడ్గతిక్కనయు బ్రహ్మరుద్ర య్యయు దమ సేనలను ఛాలేటియొడ్డున నున్న పంచలింగాల కొండకడ యుద్ధమునకు మోహరింపజేసిరి. పోరు ఘోరముగ జరిగినది. తిక్కన సేనానివహమెల్ల దుక్కుతుక్కుగ నలిగి

పోయినది. తిక్కన యొక్కడే మిగిలియుండెను అపుడు ప్రత్యర్థి యాదవరాజు రణధర్మమునకు గట్టువడి,

"పోరు నిలుపుమోయి భూసురోత్తముఁడ !
సరిగావు మాతోడ సమరంబుసేయ
నగ్రజుల్ మీరు యాదవులము మేము
ఉగ్రమ్ము మామీఁద నుంపంగరాదు."

అని యనెనట. దానిపై రణతిక్కన సైన్యమును గూర్చుకొని మగుడ యుద్ధమునకు వచ్చుటకు నెల్లూరు వోయెను. పురజనులతనింగాంచి నవ్వి కేరడము లాడుటయకాక నులకమంచము చాటున నీళ్ళబిందె పెట్టి దానిపై బసుపుముద్ద నుంచి యతని భార్య,

'పగఱకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకు లెందున్
ముగురాడువార మైతిమి
వగపేటికి జలకమాడ వచ్చినచోటన్.

అని నివ్వెఱపడుచున్న తిక్కనను బరిహాస మొనర్చెనట. అంతియకాక యతనితల్లి యన్నములో విఱిగిన పాలువోసి,

'అసదృశముగ నరివీరులఁ
బసమీఱఁగ గెలువలేక పందగతి న్నీ
వసివైచి విఱిగివచ్చినఁ
బసులున్ విఱిగినవి తిక్క ! పాలున్ విరిగెన్.

అని హేళనమొనర్చెనట. ఆమాటలు పడలేక యతడాలమునకు వెడలి బ్రహ్మరుద్రయ్యతో బోరి యిరువురును నేకకాలమున భూమికొఱగుట జరిగినదట. ఇది చక్కని వీరగాథ. ఇట్టి చరిత్ర కథ లెన్నిటికో నిలయమైన నెల్లూరి

వైభవమును వర్ణించుకొంటిమి. ఎఱ్ఱాప్రగడ పుట్టిపెరిగిన పల్లెటూరి నెల్లూరుసీమయందే గలదు. నాటివలెనే నేడును నెల్లూరిసీమ కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారివంటి యుత్తమ కవులకును, విశ్వకవి శాంతినికేతనమున విశ్వకళల నారాధించిన కళాతపస్వి, రవీంద్రకవిచంద్రుని వంగసాహితీ గీతికలను బంచమస్వరమున జాను తెనుంగునందు నాలపించిన పుంస్కోకిల ; యాంధ్రసాహిత్య మంజువనిలో జిగిర్చి వికసించిన చూతలతానవమంజరియై లలితకళాప్రియంభావుకుడై వెలసిన శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారికిని, శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారివంటి యుదార రాజనీతికోవిదులకును బురిటిగడ్డ' అని యుల్లాదుకొనుచు ఒంగోలు చేరుకొంటిమి.

ఒంగోలు వృషభజాతికి బ్రసిద్ధిచెందినది. గుంటూరు జిల్లా రెండుగ విభజింపబడినపు డదియొక భాగమున కొకప్పుడు కేంద్రస్థానముగ విలసిల్లి యుండెను. ఇట నొక కాలేజి యున్నది. హైస్కూలు కూడ గలదు. దానికి బదిరెండు మైళ్ళలో గొత్తపట్టణము ఓడరేవు గలదు. అందొక లైటుహౌసు నేటికిని గలదు. మాబండి యటనుండి కదలి చీరాల చేరినది.

చీరాల పొగాకు కంపెనీలకు బ్రసిద్ధి. పూర్వ మది యోడరేవుగా నుండెడిది. నవీనముగా నట కాలేజీ వెలసి యున్నది. ఇచటనే 'ఆంధ్రరత్న' బిరుదాంకితులగు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు రామదండును బ్రారంభించి పూర్వము నడిపియున్నది. చీరాల గదలి మా ధూమశకటము బాపట్లలో మకాము చేసినది.

బాపట్లలో ఎగ్రికల్చరల్ బి. యస్‌సి. కోర్సు నేర్పు కళాశాల యున్నది. జగత్ప్రసిద్ధ పండితులగు కీర్తిశేషులు అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులపక్షము వహించి కొప్పరపు కవులతో డీకొని యాశువుగ గంటకు మూడువందల పద్యములు చెప్పి గుంటూరులో సభాగౌరవమును గాంచియుండిరి. ఇచటనే కమ్యూనిష్టు పార్టీ లీడరగు కంఠంనేని వేంకటరత్నంగారు నిహతులై పోయిరి. అటనుండి మేము నిడుబ్రోలు చేరుకొంటిమి.

నిడుబ్రోలు సుప్రసిద్ధము. అది ఆచార్య రంగాగారికి జన్మభూమి. శ్రీ పాములపాటి వేంకటకృష్ణయ్య చౌదరిగారి యొక్క ప్రతిభా విశేషములు లోకమునకు వెదజల్లిన తెలుగు పురిటిగడ్డ. ఇక్కడ నవీనముగ నొక కాలేజీ వెలసినది. పెద్ద హైస్కూలున్నది. ఆ హైస్కూలులోని పండితుడే కీర్తిశేషులైన కవిబ్రహ్మ ఏటుకూరి వేంకట నరసయ్యగారు. అమెరికావారి హాస్పిటలు, స్త్రీల ట్రైనింగుస్కూలును నిట గలవు. ఆ చోటు కదలి మా బండి తెనాలి చేరుకొన్నది.

మా యంతేవాసులు స్వగృహములకు వచ్చినట్లే తలపోసి యలరిరి. తెనాలి రైళ్ళకు గూడలియని వారికి దెలియును. కొందఱకు గొన్ని విశేషములు తెలియక పోవచ్చును. 'సర్వః సర్వం నజానాతి' అన్నారుగదా పెద్దలు. రూపకాభినయములో సుప్రసిద్ధ కీర్తిగడించిన శ్రీ స్థానం నరసింహారావుగారి జన్మస్థలము తెనాలియే యగును. ఆతని యభినయ పాటవము, పాత్రయొక్క యాహార్యకపు సోయగము 'రోషనార' నాటకములో జూచి తీరవలయును. మఱియు దనజీవిత సర్వస్వమును దేశసేవ కంకిత మొనర్ప

గంకణము తాల్చి బాలికల విద్యాభివృద్ధికై నిశ్శుల్క హిందీ కన్యా మహావిద్యాలయమును స్థాపించి తెనాలిలో నడుపుచున్న శ్రీ యలమంచిలి వేంకటప్పయ్య దంపతుల నొకమాఱిచట స్మరింపవలయును. అంతియేకాదు. నూతాశ్రమ ప్రసంగ మెత్తక తప్పదు. 'పూరాణ గోపుర ద్వార కవాటములు బదాబద లగునట్లు నూతపురాణ మనెడి బాంబరు విమానమును సృష్టించి భావవిప్లవముతోపాటు కృతకధర్మమునకు సమాధిగట్టిన మహర్షియు శకపురుషుడు నగు కీర్తిశేషులు కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారికి నిచ్చోట నంజలి పట్టవలసి యున్నది. వారి గ్రంథపద్యములు పెక్కులు మా విద్యార్థులు బట్టీపట్టి యుండిరి. ఆ బట్టీపద్యముల గానంపు రవళితో జయజయ ధ్వనులతో మేము తెనాలినుండి భట్టిప్రోలునకు గదలితిమి. రెప్పమూసి తెఱచినంతలో మా బండి భట్టిప్రోలు స్టేషనులో నాగినది.

ఆంధ్రలోకమునకు బురాతన చరిత్రకాలమున శాంతి సందేశము నందించిన బౌద్ధవిహారస్థానమగు భట్టిప్రోలున మేము కాలిడితిమి. కాలిడినతోడనే మా నాదెళ్ళ సుబ్బరాయ చౌదరి బోర్డు హైస్కూలు విద్యార్థిబృందము మాకమందానంద సంధాయకముగా జయజయధ్వానములతో స్వాగతము నర్పించెను. వారు రైలునుండి దిగుచున్న విద్యార్థిసోదరుల నెదుర్కొని పేర్వేఱ గరచాలనములతో బిగియార కౌగలించుకొనిరి. గురువులమైన మాకు నమస్కారము లర్పించిరి. కూల్ డ్రింక్సు, టిఫినులు, కొల్లకొల్లలుగా దెప్పించి ప్లాటుఫారముమీదనే విందు నేర్పాటుచేసిరి. మేము వలదన్నను వారలాగిరికాదు. చైత్రయాత్రకు వెడలి

వచ్చిన యోధకుమారులను బురజను లెదుర్కొని సమ్మానించుపగిది వారు మమ్ము సమ్మానింపజొచ్చిరి. విహారయాత్రాదృశ్యములు తిలకించివచ్చినది మేము. అందలి యానందమును బొంది పులకించినది మా హైస్కూలు విద్యార్థులైరి. మా యెల్లర గళములందు గ్రంపు బూలమాల లలంకరించి శకటముల నధిరోహింపజేసి రంగురంగుల జిలుగు జెండా కట్టల నాడింపజేయుచు మంగళవాద్యములు మాఱు మొఱయుచుండ జేజేలు గావించుచు మమ్ము మా హైస్కూలు భవనమునకు జేర్చి మా ప్రధానోపాధ్యాయుల వారి యధ్యక్షత నొకసభ గూర్పించి పురజనులతో సమీప గ్రామ ప్రజలతో గిక్కిరిసియున్న యాసభలో మాబాలుర యనుభవ విశేషములగూర్చి యొక్కింత మాట్లాడింపజేసి మాకు ధన్యవాదము లర్పించి మమ్ము వీడ్కొనిరి. వీడ్కొనుటకు ముందు మా హంపీవిహారయాత్రను యథాతథముగా గ్రథియింప నావలని బాసగొనిగాని నన్ను వదలిరి కారు. వారి ప్రోద్బలమే ప్రోత్సాహమే నేడు వెలువడిన యీహంపీ విహారయాత్ర యను చిన్నిపూవు గుబాళించి తలారించుటకు హేతువు. కళాదేవికి యథాశక్తిని బచరించిన నా యీసేవను గళాపిపాసులగు మా యంతేవాసులు, నితరకళాకోవిదులగు చరిత్రజ్ఞులు హర్షింతురని గుర్తింతురని యరమరికవలన విరమించుచు నీ గ్రంథమును బాఠకలోకమున కందించుచున్నాడను. మా విద్యార్థులు సుసంఘటిత సుస్నేహమున గడించి యారక వెలిగించిన వారి విహారజ్ఞానజ్యోతి కిదియొక యానవాలై యలరునుగాక !

ఇతి

## మా జట్టు

శ్రీ ఘంటా రఘురామయ్యగారు (వ్యవసాయశాఖాధ్యాపకులు)
,, ఉప్పల సుబ్బారావుగారు (డ్రిల్లుమాష్టరు)
,, పాలడగు వేంకట్రామయ్యగారు (బి. ఏ., బి. ఇడి.,)
,, ముమ్మనేన్ని లక్ష్మీనారాయణగారు "హిందీ ప్రభాకర్,
హిందీ ప్రచారక్"

## S. S. L. C. STUDENTS

వేసంగి గోపాలరావు
అన్నే జగన్మోహనరావు
కనగాల మధుసూదనరావు
యం. శివరామకృష్ణయ్య
వీరిశెట్టి వేంకటేశ్వర్లు
గుత్తా జగన్మోహనరావు
పి. మధుసూదనరావు

## V F. STUDENTS

వేములపల్లి అమరేశ్వరరావు
గవిని పున్నారావు
గుత్తా కోటేశ్వరరావు
పరుచూరు కోటేశ్వరరావు
ఉపేంద్రగుప్త
కొల్లిపర నాగేశ్వరరావు
యలమంచిలి పట్టవర్ధని

## IV F. STUDENT

కొసరాజు శ్రీరామమూర్తి

## III F. STUDENT

వేములపల్లి సుబ్బయ్య

## II F. STUDENTS

పరుచూరు లీలావేంకటరత్నం
గుత్తా వేంకటేశ్వర్లు
కొసరాజు త్రిపురసుందరి
ముమ్మన్నేని రణకిశోరబాబు
ముమ్మన్నేని నరేంద్రబాబు

## మా యితర గ్రంథములు

1. ఆర్యగృహిణి
2. వైదికవివాహపద్ధతి
3. వైదికసంధ్య
4. పెండ్లిమోజు
5. వితంతువివాహాలు
6. ఈశోపనిషద్
7. కేనోపనిషద్
8. మాండూక్యోపనిషద్

## అముద్రిత గ్రంథములు

1. కఠోపనిషద్
2. ముండకోపనిషద్
3. ఐతరేయోపనిషద్
4. తైత్తిరీయోపనిషద్
5. ప్రశ్నోపనిషద్
6. ఛాందోగ్యోపనిషద్
7. బృహదారణ్యకోపనిషద్
8. భగవద్గీత
9. కేటాలాగువైద్యుడు

వైదిక సాహిత్యమండలి
అమృతలూరు (P. O.)
(గుంటూరు జిల్లా.)